# అమృతపారణము

…ప్ణస్వామరాజ ఎం. ఏ., ఎల్. టి.

రచితము.



మిత్రమండలి. గుంటూరు:

దుందుభి చైత్ర శు. పూర్ణిమ.

జయవారము.

(వెల ౦—౧-౨—౧)

భారత

ప్రదేశ

మహాపురుషుఁ

డల

మహాత్ముని

పదకమలముల

కర్పితము.

# నాటకమునందలి పాత్రలు.

నారదుఁడు.

కశ్యప ప్రజాపతి.

కద్రూవినతలు — కశ్యపుని భార్యలు.

శేష
వాసుకి,
తక్షక,
ఉగ్రక,
కాళియ,
కర్కోటక,
వామన,
పద్మ, కుముద,
శంఖ, బిల్వక, పింజర. } కద్రువ సుతులు.

సుపర్ణుఁడు — వినతానందనుఁడు.

మంథర — కద్రువ చేటి.

విప్రుఁడు
నిషాది } నిషాదద్వీపవాసులు.

హరి — ఇంద్రుఁడు

అమృతరక్షకులు — ఆదిత్యులు

బృహస్పతి — దిక్పాలకులు.



శ్రీ లక్ష్మీ హయగ్రీవో విజయతేతరామ్.

# ✣ పీఠిక ✣

ఇదియొక అయిదంకముల నాటకము. ఇందలికథ భారతము నుండి స్వీకరింపఁబడి మృదుమధురమునైన శైలిలో నాంధ్రమున గద్యమయముగ వ్రాయఁబడినది. తొల్లి యాంధ్రమున నాటకములు లేవని చెప్పవచ్చును. ఒక యర్ధశతాబ్దినుండియు సంస్కృతాంగ్లేయ భాషలనుండి యాంధ్రీకరింపఁబడిన నాటకములును స్వకపోల కల్పితములగు నాంధ్రనాటకములును, వెలువడుచు భాషాయోషకు భూషల నొసంగుచున్నయవి. సుకుమారమతులగు రాచబిడ్డలకు గుడజిహ్వికాన్యాయమున భాషాప్రవేశము గల్గించి తద్ద్వారా చతుర్విధ పురుషార్థోపాయ బోధకములగు సంస్కృత భాషా గ్రంథముల సారమును గ్రోలించుటకు కాళిదాసాది మహాకవులచే సంస్కృత భాషామయములగు నాటకములు వ్రాయఁబడినవి. ఇప్పటికంటె నప్పటికాలమున సంస్కృతభాషాప్రచారము దేశమున నెక్కుడుగ నుంటయే అట్టి నాటకములు వెల్వడుటకు ప్రబలకారణము. ప్రకృతమున నాంధ్రభాషాప్రచార మెక్కుడుగఁ గల మన దేశమున సంస్కృత నాటకము లధికముగ నాంధ్రభారతీయుల కుపకరింపఁ జాలవు గాన నింక నెన్నియో యాంధ్రభాషామయములగు గ్రంథములు వెలువడ వలసియున్నవి. మనదేశమున నాంధ్రనాటకకళ నావిర్భవించు తొలుదొల్తఁ గద్యపద్య మయములైన యాంధ్రీకృత నాటకము లుద్భవింప మొదలిడి, పిమ్మటఁ గొన్ని గద్యమయ నాటకములును తగుపాటిగ నవతరించి మఱల పద్యప్రచురాంధ్ర నాటకములు ప్రబలుచు వచ్చి

మన సామాజికులు గుణంగదు నవప్రియులగుటంబట్టియు, నాంధ్రంబున నీగద్యసంస్కారము చిరాకాంక్షితమగుటంబట్టియు నీమార్గముం దీసి. నవమెల్ల యవద్యంబుగాదుగద? గుణజ్ఞులీపరిషదులు. గుణమే గ్రహింతురుగాక. వారి యనుగ్రహంబున మనదోషంబులుగూడ గుణంబులే యగు. సందియము లేదు.

నటి—ఆర్యా ఏమంటిరి? అనుగ్రహమున్న దోషములుగూడ గుణములగుననియా? ఔర, యాగ్రహబలమంత దొడ్డదిగా? ఏమో నావంటి మూఢుల కేమెఱుక? ఇన్నినాళ్ళు మీ శుశ్రూషలోనున్న నాకొక్కనాఁడైన యీమర్మముం దెలుపరైతిరే. నాయెడ నార్యపుత్రుల కెప్పుడు దోషములే దోచుటంబట్టి గాఁబోలు.

కానిండు, ఘటనాఘటనాసమర్థు లార్యపుత్రులు. దోషముల గుణములఁ జేయుటకేమి, గుణముఁ దోషముల —

సూ—ఆగు మాగుము. దానికే యాకద్రివ త్వరపడుచున్నట్లున్నది.

పోయివత్తము. నిష్క్రమణము.



కద్రు—మంథరా, ఇదంతయు నిజమా? నీ మాటలన్నియు మనస్సును జెయికొట్టి గలంచి వేయుచున్నవే. కాని గన్నులం బొరదీసినట్లున్నది. చూచితివా? వినత సాధుశీలోపేత యనుకొంటిని గాని యిచ్చకములాడి నా యెడల ద్రవ్వునని యెఱుంగను గదే! దాని వినయము భయమును జూచి, సాధువు, చిన్నది యని యుపేక్షచే బట్టక విడితిని గాని యిట్టి కుచ్చితముల కూబి యని కలనైన నెఱుంగనే!

నా సాపత్న్యపు బుత్రులకన్న నధికబలు లిద్దఱుగావ లయునని మాదానికేల? ఔరౌర, ఆ కశ్యపార్యుని కెట్టి వరము లిప్పించుటకు నోచినదానవే? కంచె చేను మేసిన దని నట్లు కన్నతండ్రికే ద్రోహబుద్ధి జనింపజేసినట్లు డీక సవతితల్లికి సహాయము చేయ నెట్లు వచ్చెనా? ఏమి పాపము పండినదే, మంథరా! కాని, ఇంతకీ ఆ యీ వినతను వేధింపకున్న నాపేరు కద్రువ యనంబోకుము.

నా తల్లితోడు కన్న దీని నెక్కువగ జూచినందుకా నాకీ బహుమానము? దీని యుసురుసురగపులు ముక్క చెక్కలు గాను! దీని పగలు వలపులు, దీని మాయలు మర్మములు మండిపోను!

మం—అబ్బో, ఏమి పగటులు? ఏమి సంతనములు?

కద్రు—నా కన్నసంతానమును జూచి దీని నుక్కలు గాలిపోయినవా? తనకు లేదని యేడ్చిన నొకకన్ను, ఒరులకున్న దని యేడ్చిన నింకొకటిపోయె ననుమాట నెఱుంగదు గాంబోలు! చూడుము నా పంతము, దీనిని దీని బిడ్డలను పదభ్రష్టులం జేసి దాస్యమున ముంచియెత్తెదనో లేదో! నా బిడ్డల యుసురు గదా యిది పోసికొనినది? వారల మైలమోపులు దీనిచేఁ గట్టింపకున్న నన్నడుగుము.

తప్పదు గాఁబోలు. కానిమ్ము. ఇంకొకరి కింకొకరికిఁ గాదుగదా. నా యక్క కద్రువకే దాసి నగుదును. భయమేమి? నా యనుంగుఁదోడుగదా యీకద్రువ? ఒక యింట మెట్టినవారము గాని బుట్టినవారముగాము. కాకున్న నామెకు నాపై యెంతదయ, ఎంత దాక్షిణ్యము! తన కరుణను గారవమునను నా తల్లిని మఱపించినది. ఈమె ఋణము నే నెట్లు దీర్చికొందునో తెలియదు. లోకములో సవతుల పోరాట మందురు. సవతుల సఖ్యము నీమూఢు లెఱుంగరు కాఁబోలు!

ఎన్ని జన్మముల నామెకు దాసినై యూడిగము సేసిన నా ఋణశుద్ధి చేసికొనఁగలను! నా యనూరుని శాప మొక శాపముగాదు. ఆ దాస్య మొక దాస్యముగాదు. నా తల్లికి నే దాసిని గానా? నా బిడ్డలు నాకు దాసులుగారా? అట్లే యీరామెకు దాసి నయ్యెదను. ఇది నా కిహపరముల సాధకమే యగు. తేజోమయుండగు నాచంద్రుని మ్రోలఁ జీఁకటి వెలుతురు లొక్కటి యైనట్లు కృపాసముద్ర యాకద్రువపాదసన్నిధి నా బంధమోక్షము లొక్కటియగుట నా భాగ్యము గాదే! ఆమెకు దాసి నగుట గాదు! ఆమె దాసికి దాసినై నను ధన్య నగుదును; నాజన్మ పావన మగు. ఆ క్షణ మింక నెంతదూరమున నున్నదో!

ఎవ రక్కడ?

మం—(ప్రవేశము) దేవీ, నేను మంథరను. వేళ యైనది, విహారమునకు వత్తురేమో యని మాయమ్మ యడుగమనిరి.

విన—అయ్యో, ఏదో చింతనుదగిలి మఱచితిని. ఆలస్య మైనది గాఁబోలు. ఇదిగో, యొక్క నిముసము. ఇంతలో నాపూవు లెత్తుము.

(వినత లోనికిఁబోయివచ్చి యిద్దఱు నిష్క్రమింతురు.)

---

3. రంగము.—కద్రువ మందిరము.

కద్రు—ఏమి చిత్రము! ఇంతలో నెంత మార్పుగల్గినది! నియతమై నిర్ణీతమై చరించు లోకమంతయు నొక్కపెట్టున గజిబిజి యైన ట్లున్నది. కన్నులు చూచియుం జూడకున్నవి! వీనులు వినియు వినకున్నవి! క్షణకాలము యుగముగఁ దోఁచుచున్నది. నితాంతము నిర్వికారముగ నుండు నా మనస్సుగూడ, నేలొకో, మహాప్రవాహమునఁ జనిచని సుడివడుచున్నట్లున్నది.

అంతరంగమున నా వినత తప్ప నింకేమియుఁ గాన్పింపదు. దానికపటనాటకమంతయు స్మరణకు వచ్చినకొలఁది నా యొడలు దహించుకొని పోవుచున్నది. ఔరౌర, యెంతటి విషకుంభ మీ వినత! నా యంకమున నుండి, నాకై ప్రాణములనైన విడచునట్లుండి నా కసువులయు నుసురు పోసికొనెగా! తన యనూరుఁడు చచ్చి బ్రతికినను బుద్ధి రాలేదా! అన్యులదుఃఖ మాత్మకుఁ జేటని యెఱుఁగదు కాఁబోలు, ఛీ! ఎంతటి పాపాత్మురాలవైతివే! నిన్నారక విడచిన యమునివారు నిన్నుఁబట్టి బాధింతురేమో! నిన్నిచటనే దాస్యనరకమునం ద్రోసిపుచ్చెద.

నై చింతింపఁ గార్యము గాదు. ఆప్రొద్దటు ప్రొద్దుకుంకునంతలో నది నాటినవిషబీజము నింద్రజాలకుని పగిది మొలపించి, పెంచి పెద్దజేసి, చిగురువెట్టించి, పూతఁబూయించి, ఫలములఁ బండించి దాని మాయాఫలమును దానినే దినిపింపకున్న నాయాఁడుపుట్టుకి పుట్టుక కాదు.

(చేటి ప్రవేశము)

చేటీ! మనమంథర వినతలు వచ్చుచున్నారేమో చూడుము.

(చేటి నిష్క్రమణము)

ఇంతసేపూరక వాపోవుచుంటినే గాని క్రియోపాయముల నరయనైతిని. ఈ పోయి వచ్చునంతలో నెట్లైన దానిని నామాటలఁబడవైచి దాని త్రాట దానిం గట్టివైచెద. నిలువఁబడినచో

నాకుఁజూడ నీవార్నిధి యొకయుద్యానముం బోలియున్నది. ఆ విద్రుమలతల యలంకారము నీ వెట్లు మఱచితివమ్మా? ఆ ఘనరసపాత్రలచే శోభితమై రంగరమ్యంబై కేవలము నాటకప్రయోగంబునుం బోలి పొలుపుమీఱుచున్నది గదా!

ఆ కిరికరాఘాతములకా నీ వెఱపు? ఆమాత్రము సంచారము లేమి నాశృంగారము ప్రౌఢ మగు టెట్లు? ఇదియా నీభయహేతువు? వలదు వలదు. అహిమకరసంగతి నుప్పొంగుచు దివంబునుంబోలి దీప్తమై, యుదారమై, గంభీరమై యెట్లీరత్నాకరుండు విలసిల్లెడునో తిలకింపుము. మహాసత్త్వులగు నాగుల శిరోమణులవి యా దీప్తి. మహావ్రతశీతపీడితులగు మునులకు సౌఖ్యహేతు వా బడబాగ్ని విలసనము.

ఆ సముద్రుని గాఢాశ్లేషముల నివ్వేల యిదివఱకె కెఱుంగదు గాఁబోలుఁ. తానెంతయు భయకంపితయైన ట్లివ్వనలతాలాస్యమభినయింపుచున్నది.

కద్రు—ఇది కపటశృంగార మంటపము గాఁబోలు. కాని, యల్లదె, యా సముద్రుని యఖండనీలిమయే దిక్కులనెల్ల నలముకొనుచున్నట్లున్నది. అన్నిటికన్న నా యపరదిక్కునఁ గాలమేఘములపైఁ గాలమేఘము లెట్లు పెనఁగొనుచున్నవో చూడు. తననునమ్మి తనయెడఁ దలఁదాఁచుకొను నభ్భానుని ముంప సమకట్టుట కతఁడేమి యీచండాలునికి విసము వోసెనా! తనమీఁద నప్పులపై నప్పులు బడుచుండ మిత్రధర్మము పాటించి సహస్రకరములఁ గాచి కాపాడుచుండునే! దుష్టులకుఁ జేయు తుష్టి యిట్టి ఫలమ్ములే యీనెడు గాఁబోలు!

ఏమి చిత్రము! మరల నింతలో నెంత తమోరాశి పెరిఁగినదో చూడు. వీని కిప్పుడు రాహుమహాదశ పట్టినట్లున్నది గదే!

దుష్టుల యభ్యుదయము శిష్టుల పరిభవమునకేనా? లోక బాంధవుఁడే యతఁడు. అతనికో వీని కేనాఁటిపగ?

లేక యీరసనా? అతని వసుసమృద్ధికిఁ దన విషసమృద్ధిని బ్రతిసేయుచున్నాఁడు గాఁబోలు. ఎంత మూర్ఖము! ఇది వఱకితని తామసము ఘనమై గట్టులందును, నీరై యితని నిలువునందును మాత్రమె చూచితిని. నేఁడెట్టి దుర్దినమో, యది ఘనాఘనమై యభ్యాసం గప్పఁజూడ నయ్యెను.

విన—అక్కా, నేఁడు నీ వేలొకో యతివచించుటఁ గనుచున్నాను. ఈ భావోద్రేకమేల గలిగెనో దెలియరాకున్నది. అమాయకుఁడు నిరపరాధి యగు నాసముద్రుని యున్నట్లుండి శపియించుచున్నావు నీ భావుని కేమియు భయము లేదు. నారకంబునఁ గిల్బిషంబుల దిగనాడి కీర్తికాయుఁడై వెడలు పుణ్యాత్మునింబోలె యిప్పుడ యత్తేజోమూర్తిం జూచెదవు.

సముద్రుని నైల్య మనుచున్నావు నైల్యమతని రూపమందుండిన నుండుఁ గాక. అతని గుణమునం దావంతయు లేదు. గుణరూపభేద మెఱుంగని దానవు గావు గద. నైల్యము లేని యెడ నైల్య మున్నదనుట పాడిగాదు. అందులో ధీరులలో ధీరుఁడు, నుదారులలో నుదారుఁడీ సాధుసత్తముని యెడనా?

పోనీ, యీ వసుమంతునిపై యీరసమనుట కితఁడు వసుమంతుఁడు గాఁడా? తనకు లేకున్నఁ గద యితరులదాని కాస పడవలయు. ఆ సూర్యుఁడు దినమణి యైనచో, దివ్యమణు లితని గృహాంగణమున నన్ని లేవు? అతని వసుమత్త్వమున కెట్టి లోపము లేదు.

ఆ సూర్యునికరములు సహస్రములై యుండుఁగాక. క్రిందై సాచిన కరము లెన్నియైననేమి? సహస్రములైన నేమి, శత

సహస్రములైన నేమి? మీఁదై యిచ్చు కర మారత్నాకరునిదై
యుండఁగా? సత్వము ప్రధానముగాని సంఖ్య ప్రధానమా?
ధారాగ్రహణముచే జీవించువాఁ డాసూర్యుఁడు. వాని ప్రశం
సతో నయ్యెడి దేమి, పోయ్యెడి దేమి?

మరలుదమా? నామాటల కలుగవలదు సుమా. వాదము
నకు వాదించితినే గాని యీ సముద్రుఁడు నాకుఁ జుట్టమా.
ఆ సూర్యుఁడు నాకు దాయయా?

అల్లదె చూడు. ఆకసమున మునిఁగి తేలుచున్నట్లా సూర్యు
ని బింబము శుచియై, శుభ్రమై ప్రభల నీనుచు నెట్లు నేత్ర
పర్వము గావించుచున్నదో!

కద్రు—కర్ణపర్వమైనది. ఇఁక నేత్రపర్వమా? అది సరిగాని, యాసూర్య
బింబమును ధిక్కరించుచు వచ్చి నిలచిన యాధవళాకారముం
జూచితివా? అశ్వముగనున్నదే! నిజముగ నశ్వమా, లేక నా
కన్నుల భ్రమయా? హల్లకల్లోల మగుచున్న యీ మాయ
సంద్రము గ్రక్కివైచిన ఫేనపుంజమా? నా కేమియుఁ దోఁచ
కున్నది.

వినత—సహజధీరవగు నీకేలనమ్మా యీ యుత్తలపాటు? ఇంకను
సముద్రుని మాట మరవకున్నావు. సముద్రుని ఫేనపుంజము
గాదు; దివమునుండి రాలిన యుల్కయనందగు. ఆహా, నిక్క
ముగఁ బైన నాయఖండ నీలాంబర విలసనము, క్రింద నీయఖం
డకాలాంబుధి విసరణము! ఈరెంటి నడుమఁ బ్రదోషరమణీ
యంబగు మహాపురుషు గీర్తినిం బోలి యీ యశ్వరాజు మూర్తి
సుస్థిరమై యెటుల నున్నదో!

కద్రు—వినతా, నీయుపమానము రమ్యమయ్యు నతిగూఢముగ
నున్నదే! ప్రదోషమున మహాపురుషు లేడ, వారికిఁ గీర్తియేడ?

ప్రదోషకాల మందువా నాఁటి మహాపురుషుఁ డాదోషాక
రుండుగాక మఱెవ్వఁడు? ఈహయరత్నము వానిం బోలియున్న
దందువా?

వినత—అయ్యో, ఇందు దోషాకరుం డెవ్వఁడు, గుణాకరుం డెవ్వఁడు?
ఆ సుధాంశు, నా శుభ్రాంశు బోలియున్న దంటిని.

కద్రు—అవునమ్మా, నీమాటలలో నేమియుదోసము లేదు. ఆదోషాకరు
నందును దోసము లేదందువా?

వినత—అయ్యో ఉండిన?

కద్రు— సరి. అల్లదె యతిధవళంబైన యశ్వంబు నందు సంపూర్ణ
చంద్రునందుఁ బోలె వాలప్రదేశంబునందు నల్ల, నా కగుపడు
చున్నది. నీకు నగపడుచున్నది గదా?
ఇప్పుడు నీయుపమ పూర్ణోపమ యైనది.

వినత—(విషణ్ణయై) నీ వేకన్నులం జూచితే, యక్కా? అతినిర్మలవపు
షంబున నల్లయెక్కడిది? నల్లమాట ముమ్మాటికిఁ గల్ల. కల్ల. కల్ల.

కద్రు—వినతా, ప్రాకృతవై చూచియుఁ జూడకున్నావు. నిదానించి
చూడుము, నల్లయుండిన నేమిచ్చెదవు?

వినత—అక్కా చూచినను జూడకున్నను నాకన్నులనే నేను నమ్మ
వలయును.
అంతభ్రాంతి హేతువే మున్నది?
ఏమిచ్చెదనందువా? అది యిది యననేల? నాశరీరమును
నీకిచ్చెదను. నీ యిచ్చవచ్చినట్లు నన్నుఁ బాలింపుము.

కద్రు—అమ్మచెల్ల! ఎంతకఱకు మాటాడితివే? సరి, నాకు నదియ ప
ణముఁ బెట్టుము. అమ్మహాశ్వము ధవళదేహమున నల్లకల్గిన
నీవు నాకు దాసివి. మణియందు నల్ల లేకున్న నేను నీదాసిని.

వినత— అదియే పందెము.

కద్రు— అదియ పందెము.

విన— అయ్యశ్వంబుఁ డాసి చూచివత్తము రమ్ము.

కద్రు—(రెండడుగులు చని శంకించి) అమ్మ, అమ్మ, ఇప్పుడు చీఁకటిపడు చున్నది. రేపకడ వచ్చి చూతము. ఉచ్చైశ్శ్రవంబైనను మేఘశ్యామలంబు లగు నీకచ్ఛకబయార్ల్లంబడి మఱలుట దాని వశముగాదు. రేపకడఁ దప్పక వచ్చి చూతము.

---

## ద్వితీయాంకము.

### ౧ రంగము. కద్రువ సౌధము—కద్రువ—మంథర

కద్రు— వెల్ల నల్ల యంటివిగదే. వెల్ల నల్లయగుటెట్లు?

మం— అదుగో, యా వెల్లజాబిల్లి నడుగరాదా? నీకు నాకుఁ గావలసి నంత నల్లచూడుగో.

కద్రు— వాఁడేమెఱుంగునే! వెల్ల మున్నీటం బుట్టె; వెల్లమిన్నేటి గట్టులం బెరిఁగె; వెల్లమన్నిఁడు దలఁ బెట్టిన నట్టెనిలచె. కులగోత్రములే గాదు; వీని నిలువు గోలువులు నట్టివ. వెల్లవేసమున వెల్లచేరుపుచుంటయే వీనిపని.

మం— అయ్యో, కువలయానందకరుండగు చంద్రుఁడుగదమ్మా. వీనిం గన్నులారఁజూచినఁజాలుఁ దాపత్రయంబులు జెల్లారునట్లుండునే. వీఁడు నీకెట్లు ప్రత్యర్థియయ్యె?

కద్రు— ఎట్లందువేమే మంథరా? వెల్ల నల్లగఁజేయఁ బూనిన నాకెదురై జగము నల్ల నంతను వెల్లఁజేయ సమకట్టిన సామంతుండు గాఁడఁటే వీఁడు?

మం— సమకట్టిన మాత్రన సామంతుండయ్యెనా?

కద్రు— అయ్యో, వినియాగడము నీకేమెఱుక? సమకట్టిన మాత్ర నసు మన్నావు,

ఆపయోముఖముం జూచి భ్రమిసితివిగాఁబోలు. నిలువునవిష ముంట నీవెఱుఁగవు వాని నీతి జాతి మర్మములు నీ కేమైనఁ దెలియునా ?

మం— తెలియు కేమి? వానిజాతి బ్రహ్మజాతి, నీతి రాజనీతి. నేనే యననేల? ముల్లోకము లీవార్త నెఱుంగును.

క్రదు— ఆహా, నిజముగ మర్మమెఱింగి మాటాడితివిగదే. తండ్రి విప్రుఁడు; తాను రాజు; ఇఁకఁ గావలసినదేమి? కొడుకు వైశ్యుఁడా? ఆ శిష్టదంపతుల కడుపు పంటఁ జే యీ ఆతతాయి! ఆ యత్రిమహర్షికిఁ బుత్రుఁడా? ఆ యనసూయ వీనిం గనెనా? ఆహా! ఏమి కారణార్థము? సరిగాని వీని బ్రహ్మత్వమున నొకవేళ నాసత్యలోకమే యబ్బె ననుకొందము. వీనిరాజత్వమున కే లోకమో?

మం— రాజులు స్వార్థరహితులు; పరార్థైకజీవులు. అట్టియెడ వారికి రాజ్యాంతమునఁ బుణ్యజనోచితమైన లోకమే ధ్రువము. ఇఁక నితఁడో సాక్షాద్రాజయోగియనఁదగు నక్షయకలావిభవుఁడు.

క్రదు— మంథరా, తెలిసిమాటాడుచున్నావో తెలియకమాటాడుచున్నావొ గాని నీమాటల చమత్కారము నీకే దగియున్నదే.

మం— ఏమమ్మా?

క్రదు— ఏమిలేదు. నీ వనిన ట్లా వెల్లరాయని పరార్థజీవనమే యాతని స్వార్థరాహిత్యమును వేనోళ్ళఁ జాటుచున్నది. వేఱుగఁ జెప్పవలెనా? ఇఁక వీని రా యోగివార్త, కలాక్షయత్వమె దోడు పెట్టినచో సాక్షాద్విభూతిపురుషుఁడగు రాజశేఖరుఁడై యుట్టిపడవలసినదే.

అయిన, వీని కైలాసమేడనే?

మం— ఇచ్చటచ్చట ననసేల ? ఆ రాజశేఖరుని కొక్కటే కైలాస మాళ్వేశగృహాంగణమున. ఇతఁడో కువలయ సార్వభౌముం

డంటిని గదా? ఈతని రాజ్యమున కాళరేయంతములు.

కద్రు—సరిసరి, ఇంతటి యూశాపికాచి వింకం జూడను గాంబోలు. ఆకస మను మహాసముద్రమున నొక యొండుటాకువలె మునింగి దేలు చుండు వీని రాజ్యాశలాశలం దాటుంగదా? వీని తత్వం బిపుడు దెలసినదిపో. వీనిగుణగణ మెద్దియైనం గానిమ్ము. దాని నడంచుట కాలోభంబొక్కటియ చాలు. వీని రాజ్యఫలము గువల యూనందమూ ? ఇంక వలసిన దేమి ? కలినాటకంబునకుందగిన సూత్రధారుం డమరె.

మం— కలినాటకమూ ? చంద్రుండు సూత్రధారుండా ? ఏమో యమ్మ, నీవు చేదువుల సరస్వతివి. ఆచేదువుల సామ్యముల మర్మములు నీకే దెలియవలె. పాపమునకుం బుణ్యముందోడను రహస్యము నెఱుంగునంతటి గల గ్రాహిని గాను. నీకును మహా గ్రీష్మములు వాపిన వాండే చల్లనిచూపుల చందమామ. వాని యేలుబడి నీలోకమెంతయు రంజిలుచున్నది. వాని కరచరణ ములం గన్నుల నద్దికొని శమించుచున్నది. నీకింతపగదాయ యకుటిలాకో నే నెఱుంగను.

కద్రు—నీవు బేలవే, నీవేమియు నెఱుంగవు. పడంతులనేచు పాతకి వీండు నీకుం జుట్టముల సురభియయ్యెగా? వీని రాజ్యము సేమ మో యుగ్గడింపుచుంటివి. నే నెఱుంగ ననుకొంటివి గాంబోలు. ఆండుపై పుట్టిన నీకు జాత్యభిమానమైన లేదయ్యెగదే. చల్లని దొరయంట, చల్లని రాజ్యమంట. వీండు రాముండనుకొంటివో, వీనిరాజ్యము రామరాజ్య మనుకొంటివో! వీం డొక రాజేనా? తరాజులరాజు, ఏదీ, యీతని రాజత్వమున రాజ్యములేమైన రాణకు వచ్చెనా? ద్విజులెవరైనం బ్రాభవముం జెందిరా ? విద్యలు విలసిల్లెనా? కళలు గణుతికెక్కెనా? వర్ణములు వాసి

గాంచెనా, ఆశ్రిమంబు లభివృద్ధియయ్యెనా ? ఏటికే యీరాజ్యము?

మం-(స్వ)శుశ్రీమించి రాగమునఁ బడుచున్నది. ఈయారోహణావరోహణములఁ దవిలిచూతము. (ప్ర) దేవీ, యతఁడేగాకున్న భూమిలోపలఁ బూర్ణవిధులింకెవ్వరు? అందులో రాజులధియసిధారావ్రతము. వారిసాధుత్వ మా పరమేశ్వరునకే యెఱుక. కానియట్లని యీ యమృతకల్పుని దూఱుటకు నాకు నోరాడకున్నది సుమా. ఈకళానిధివల్లనేదిక్కుదిక్కుల వారలు దెలివిఁ గనుచున్నారు. ఈవసుఖుని వల్లనే విబుధులు గడుపారఁ గుడుపుఁ గనుచున్నారు; ఈమహావిధువల్లనే శిష్టు లలరఁగ దుష్టు లలయుచున్నారు; ఈసత్ప్రభునివల్లనే మోదించి కువలయం బెచ్చుగాఁ గూర్మి గనుచున్నది అవుర, ఈరాజుమహిమ యేమనవచ్చు! తమము వారించి, యనులసంతతినడంచి, యన్యరతిడించి, హరిపదమాశ్రయించి, పూర్వాపరంబు లేకచ్ఛత్రంబుగ నేలుచున్నవాఁడీ ద్విజరజు. ఇహామునఁ గీర్తికాయుఁడై వెలసినవానిని వీసందక్క నింకొక్కని గని విని యెఱుంగ.

కద్రు—ఎట్టెట్టూ? కీర్తికాయుఁడై వెలసెగా యీ ద్విజరాజు! వీని రాజత్వము నపేక్షించు నంతటి యభాగ్యులైరా యీద్విజులు? ద్విజహాతకులకు, హంతకులకేగాని సద్ద్విజులకీరాజ్యమున నిలువ నీడయైనఁ గానమే? వీని బూదివెలుంగుఁ జూచి పాప మాఛాందసులు దెల్లవారిన దనుకొనిరి గాఁబోలు.

నీ కేవంక చుట్టమే యీ నిశాచరుఁడు? వీనిం బట్టువలెఁ బొగడుచున్నావు? నీమాటల నూరక పోనియ్యరాదు. ఈరామరాజ్యమునకు సంతసించుదానవు నీవొక్కతెవెగా! ఆ, ఆ రామునికి నీ రామకుం దగిపోయినది పో. వాని రంజనకు రామ లింకేరుంగఱఁగుటలేదు; రాళ్లు గఱఁగుచున్నవి.

సుమము లాకమలములు గుములుచున్నవి. ఇదిగదా వీని పౌరు
షము? పోసి, యు దెక్కైన మండిపోనిమ్ము. సాధ్వీరత్నము
లాపద్మినులజోడ యీకిరాతునికేల? తన్మిత్రుఁడు దనకుఁ
బ్రాణమిత్రుఁడుగా? తనను బిలచి బిచ్చము వెట్టినవాఁడుగదా?
వాఁడాధూమకేతువుఁ మింగనున్నపుడు వేవేజెనుదెంచి, వాడి
కరములఁ బఱపి, కతువి చెండాడి దన ప్రాణములు గాచెనే?
అట్టి మిత్రుఁడెమరైనపుడు వాని విభవముం జూడఁజాలకయో,
దనకు ముఖము చెల్లకయో, యటుసటు మసలుచుండు. అతఁ
డటుగను మఱఁగినంత నతసి కళత్రంబుల జోడం బోయి తల
లెత్తి తన దిక్కైనఁ జూడనోపని యాపూబోణులఁ జెఱగాని చేఱ
బెట్టుచున్నాఁడు. అతఁడటు మునుంగుటఁ జూచి యాతని ధనము
నంతను నొడిలోఁ బోసికొని పోవు వాఁడు వీనిని దొంగయనక
దొరయనుచున్నావా? లోకములోన మిత్రులు ద్రోహులుం
దురుగాని యిట్టి మిత్రద్రోహి నెక్కడఁ జూడఁబోము.

మిత్రద్రోహముతో నయ్యెనా? ఆగురు విషాదయోగము
దెట్లు? అదిదెచ్చిపెట్టిన వాఁడీ మహాపాపిగాఁడా? సత్ప్రవర్తినసు
తత్ప్రతిపదవర్తియయ్యెనే? ఇఁక నాగురువు కలల గోని సందుకు
దక్షిణయని గాఁబోలుఁ దనకళనాతని యింట భద్రము చేసివచ్చె.
సాంత్రిడాయిటుఁడీ గురుద్రోహి! ఛీ! వీనిముఖము జూడనగునా?
రాజీనని ప్రజలపరిశ్రమలం బాపి, వారికి హాయినొసంగు మిష
చే వారిని మాయ నిద్రంబడఁ ద్రోసి, వారి చైతన్యంబుల ప్రా
ణాడి, కరముదిమి, వారల యాయువుల హరింపుచున్నాఁడు. వల్లె
కాటికాపరి, వీని కేటి దయ? ఏటి దాక్షిణ్యము? నీటఁబుట్టి
నిప్పులేకుండఁ గాల్చుచున్నాఁడు. ఇంటనుండి యిలుగు ద్రిద్దలిం
చుట వీనివృత్తియైనది సుమా! భువిని మిత్రద్రోహులుందురుగాక,
గురుద్రోహులుందురుగాక, తన ప్రజకుఁ దా ద్రోహమాచరిం

చు వాఁడీ రాజు వీనిరాజహాసంబు గాల్పనే? విశ్వద్రోహి, వీనికింకను ద్రోహమున్నదా? చిత్రములలోఁ జిత్రము! ఇన్ని యవకాని దుర్దమముల కాకరుఁడయ్యుఁ బుత్రమిత్రకళత్రంబు లొకవంకను, పిండిన కొల్వుకూట మింకొక వంకను వెంటరాఁ దగుదునని తలయెత్తికొని చిన్నెలు వన్నెలతో వినువీధింబడి పోవుచున్న వాఁడీ బుడశశిఖండి. వీనిమచ్చమాయ! వీఁడఁటే నీరాజబంధువు?

చూచితివా, తన యీదోషాకరత్వంబు నంతను బాపుకొనుటకుఁగాఁబోలు సుధాకరుఁడై దాకినదంతయు వెల్లచేయుచున్నాఁడు. నల్లని యాకసమంతయు వెల్ల. నల్లని కొండలన్నియు వెల్ల. నల్లని సంద్రము వెల్ల. అది యిది యననేల? వీనిసోఁకునఁ జిమ్మచీఁకటులు వెలవెలఁ బాఱుచున్నవి. వీని రాజ్యమే వెల్లవెలుఁగయ్యె. నల్లని భూమి నంతను వెల్లఁజేయక విడువఁడు గాఁబోలు నీకాలనేమి? తన సీమం దాఁ బడియుండనోపని యీమాయమారీచుం డెగటార్చు రాముఁ డేడనున్నాఁడో గద? మొన్నటి యీమహాగ్రహణమైన వీనిని మ్రింగదాయెనే! లోకము నిష్కంటకంబై యుండెడిది. పాపి చిరాయువని వీనికింకను దినములు పెరుఁగుచున్నవి గాఁబోలు. కానీ, కాల మేరికిని గడువరాదు. వీని పాపము పండినప్పుడెల్ల నా కాలపురుష విజృంభణమే దాపయ్యెడిని. ఆకాలసముద్రము పొంగి పొరలి, మింటికెగసి, భూనభోంతరము లేకమైనపుడు వీని కళా వార్త, వీని భూభృత్త్వమూ నేలఁ గలియకుండు నెట్లో చూతము. వీనికపుడే దిక్పాలకుఁడు, ఏ పూర్వమిత్రుఁడు, ఏసమయసంధు లడ్డమువచ్చెడినో చూతము.

సుం—దేవీ, నీవు గురిపించినవి శరములు శాపము లనరాకున్నవి. నీవే మీఁదై యీచంద్రుఁడే కిందైనచో నిప్పటి కాతఁ డంపశ

య్యం బడియుండవలసినదే. కాలగతింబడు వారి కడ్డపడు వా రెవ్వ
రు? పంతములతో నేమి? యనిఁ బూనవలె, ఫలము లందవలె.

అదిగో, నీకోర్కె యిప్పుడే ఫలించునట్లున్నది. కాలము
బ్బాకటి యాచంద్రునిఁ గ్రమ్ముచున్నది. ఆపెనుభూతము నోటం
బడి వెడలినప్పటికిఁ గదా. ఈగుడ్డివెన్నెల నుండరాదు. ప్రొద్దై
నది. ఇఁకఁ బోయి పరుందమా?

కద్రు — ఆహా, నీవంటి చెలులుండఁగా ప్రొద్దు పోవుట కేమి? రమ్ము.
సమస్యాపరిష్కారమైనదిలే.

---

౨ రంగము — కద్రువమందిరము.

కద్రూనాగ సమావేశము.

(ప్రవేశము:— శేషుఁడు, సుముఖుఁడు, తక్షకుఁడు)

శేషు — సుముఖా, మాతృశ్రీ మనసందఱనీ వేళఁ బిలుచుటకుఁ గారణ
మేమో, నీకేమైనఁ దెలియునా?

సుము — నాకేమియుఁ దెలియదు. శీఘ్రముగ రమ్మనుటచే నేమొకో
యని వచ్చితిని.

శేషు — అదిగో, క్షేమక వాసుకులుగూడ వచ్చుచున్నారు.
మంథరా, మేము వచ్చితిమని మాయమ్మ కెఱింగింతువా?

మం — చిత్తము. (నిష్క్రమణము)

క్షే — మన యనూరుని క్షేమవార్త యేమైన వచ్చినదా?

శేషు — నిన్ననే వచ్చినది. మాతృశ్రీ వినత కెఱిఁగించి యిప్పుడే వచ్చు
చున్నాను. పుత్రప్రవాసమునకుఁ గాఁబోలు నామె యతిఖిన్న
యైయున్నది.

క్షే — అట్లా, పోవునప్పుడైనఁ జూచిపోవుదము.

(కద్రువ, సుతులు కర్కోటక వాసుకి ఉగ్రక, సురాముఖ కుముదులు ప్రవేశము. ఉన్నవారు నమస్కరింతురు.)

కద్రు—శతాయుష్య మస్తు.

నాయనా, మీయమ్మ కేమి కష్టము వచ్చెనో యనుకొనుచున్నారు గాఁబోలు. నిజముగఁ గష్టమే వచ్చినది. కాని నాకా వంతయైన భయము లేదు. మీరిందఱు పుత్రులు నాకుఁ బెట్టని కోటలై చుట్టునుండఁగ భయమేటికి? మిన్నువిరిగి మీఁదఁబడినను నేఁజలింపను.

వాసు—తల్లీ! విషయముం దెలుపుము. దానికింత ప్రస్తావనయేల? నీభయమేమి? దానికిఁ గారకులెవ్వరు? చరాచరంబులలో నీకుఁ గాని వారెవ్వరైననేమి? ఈక్షణమునఁ బట్టి పరిమార్తుము. లేదా, కట్టి తెచ్చి నీ పాదములఁ బడవైతుము.

ఉగ్ర—యక్షరక్షోగణంబులైనఁ గానీ, తచ్ఛిరంబుల ఖండించి, యారక్తస్రవంతి! భగీరథుండు భాగీరథింబోలె, నీకన్నుల మ్రోల నవతరించునట్లు చేయనే. ముల్లోకంబులు దల్లడిల్లినను, నేను నాప్రతిన వీడువాఁడను గాను.

తక్ష—సోదరులారా, మీవీరాలాపంబు లస్థానంబు లనిపించెడిని. చూడఁజూడ నాకిది యేమో గృహచ్ఛిద్రముగ నున్నది. ఎండకన్నెఱుఁగని మాయమ్మగారుల బాధ యేమి యుండఁగలదు? కానీ, యెవరెట్టివారైనను యుక్తియుక్తంబగు ధర్మసూక్ష్మం బరసి వ్యవహరింతము. దాన సంకటములన్నియుఁ బాయు.

కద్రు—అన్నలారా, మీమాటలకు నాయాత్మ యొకింత సేద దేఱినది. నాకష్ట మింకఁ దీఱినట్లే. ఏమందురా, నిన్న సంజెపొద్దు మా సమాతయగు వినతయు నేనును విహారమున కేగితిమి. మాకనతి దూరమున వజ్రనిభంబగు హయరాజంబొక్కటి పచ్చికఁదినుచుండె. తచ్ఛాయాఫలము గాఁబోలు నాహయవాలంబున

మచ్చయొకటి నాకన్నులఁగట్టినట్లుండె. అదిచూచి 'అల్లదె నల్ల' యంటి. దాని కేలొకో యావినత రోషించి నేను కృష్ణపక్షపాతి నని, యుల్లసమునఁబందెము పలిచె. నల్లయుండినఁదాను నాకు దాసియగునఁట; లేకున్న నేనుఁదనకు దాసింగావలయునఁట. అడ కత్తునఁబోకనై. నేనియ్యకొంటి. దానిధైర్యముఁజూడ నల్లయుం డినను దానిం దెల్లఁగఁ జేయఁగలట్లున్నది. నాకేమియుఁ దోఁచ కున్నది.

**శేషు**— తల్లీ మహావిపరీతము సంభవించినది.

ఏకమాతృబలమే దైవబలమందురు. మీ యిరువురఁజూచి కొని మాకట్టి బలము ద్విగుణమని పొంగుచుంటిమి. మహా దారయగు నామెకును నీకును వైరముఘటిల్లుట మాదుర దృష్టంబుగాకిం కేమి? విషమపరీక్షం జిక్కుపడితిమి. దైవఘ టనం దెలియఁగరాదు.

**సుమ**— అమ్మా, నిన్నారక 'యమ్మా' యని పిలుచుటేగాని యామె వాత్సల్యంబులో నొకపాలైన నీవలనం గొననైతి. అనూరుఁడు నే నభేదముగనుండుటేగాదు; ఆమెయు మాయిరువురియెడ భేద మెఱుంగదు. అనూరుఁడు దన యధికారమునకేగుచు నాకును దల్లికిని జెప్పిన మాటలు ప్రాణంబులుపోలె: దాల్చియున్న వాఁడ. ఇపుడు గర్తవ్యమేమో నాకు దురూహ్యముగ నున్నది.

**కద్రు**— నాయనా, వినత నీయెడ నెంతప్రేమగలది నే నెఱుంగనా? నీకన నేమి? నాకెట్టివినయవిధేయతలం జెలంగుచుండె? అట్టిసుగుణ వతి నాకుఁ దోడగుట నాయదృష్టం బనుకొంటిని గదా? దాని కిట్టి ద్రోహబుద్ధి జనించుటగూడ నా పాపఫలమే యనుకొను చున్నాను. కాలముగాని నాఁడు గడ్డి గఱచునందురు. ఒక్కనాఁ డొక్కమాటవలు కెఱుంగమే. నేఁడు దీని కీవంచనాభావ మెట్లు పొడమెనో? లోకములో నెందఱో సవతిబిడ్డలని యాడిపోసి కొనుచుందురు. దాని కాయసూయగూడఁ గానవచ్చెడిది గాదు.

నానూర్వురు దనవారనియుఁ, దన యిరువురే నావారనియు నెన్నిమారులో యనుచుండెడిది. అట్లే యనుకొంటినిగాని యింతగడుసుఁదనమునకు దిగునని యీగడియనుగూడ నమ్మఁజాలకున్నాను.

ఏమియైనను, మీరెగదా నాకు దిక్కు? మీతండ్రికే మీయీ నివి బట్టవు. ఆయన తపశ్చరణమునకు భంగమొనర్చి యాపాపముగూడ నొడిఁగట్టుకొన నొల్లను. మీతల్లిని మీరు రక్షించుటో, నా సవతికి నన్ను దాసిం గమ్మనుటో మీకే వదలితిని.

మిమ్ముం బలదర్పుల నూర్వురఁ గడుపారఁగంటిని. పెంచి పెద్దఁజేసితిని. ప్రాణములైదేయైనను నూరుగఁజేసి మీపైఁ బెట్టికొని యుంటిని. మీరందఱుఁ బ్రయోజకులైయుండ నా కాలము సవ్యముగఁ గడచె, నాకిఁకఁ గావలసినదేమి? యనుకొంటిని.

దాసికి దాసినగుటేలొకో? ఇదేటిపందెమో? నా ప్రాణములే యడిగిన నుత్సవముతో నిచ్చియుందునే. సడికన్నఁ జావు మేలయ్యెడు. దానికిఁ గందగిన దాసి యగుపడకుండెను గాఁబోలు! ఇంతకు నాప్రారబ్ధము. దాని ననిన లాభమేమి? హాం హా, దైవహతక!

శేషు — తమ్ములారా మీమీయభిప్రాయములేమో దెలుపుఁడు. ధర్మం బిడియుని పరిష్కరింపుఁడు. ధర్మరక్షణ పట్ల ధైర్యరక్షణ మావశ్యకము. సుఖదుఃఖములు అనిత్యములు. ధర్మమొక్కటే నిత్యమై నిలచునది. ఎప్పటికైన ధర్మమునకు హానిరానీజనదు.

తక్షు — అగ్రజా, ఇట్టితఱి ధర్మాధర్మ పరిష్కారముఁ జేయుటకు సకల లోకారాధ్యుఁడవగు నీకన్న నింకెవ్వరధికులు? ఆ యధికారము నీయదియ. నీమాటయే మాకు వేదవాక్యము. నీవాచరిం

చునదియే మాకు నుత్తమోత్తమమైనధర్మము.

( అందఱూరకుందురు )

శేషు—తల్లీ, నీఋణమింకేవిధినైనఁ దీర్చికొందుము. ఆహాయముచైత్ర్యవంబేయగు. దాని ధావళ్యంబు నకలంకంబేయగు. ఆమెయునిష్కపటమైయుండ నోపు. మీరొండొరు లిట్టి పన్నిదము సలుచుట విధి చెయ్యుమనిపించెడిని. దాని కెదురొడ్డ వారెవ్వరుః యద్భావ్యం తద్భవతి.

కద్రు—(నిట్టూర్చి) జారార, నాపురాకృత మిటుండ నెవరి నేమనఁగలను! మగఁడేమి చేయఁగలఁడు? బిడ్డలేమి చేయఁగలరు? ఎవరిమంచి చెడుగులు వారివ. ఒకరికొకరు కర్తలు గారు. ఒకరి కర్మఫలము లింకొకరు గుడువఁ బోరు.

ప్రియము వచ్చుదనుకనే బిడ్డలను వివేకము నాకేలఁ జెడవలె? తోడునకు దాసి నగుదునను ఖేద మటుండ నాకన్న బిడ్డలె నన్నుఁ దెగనాడిరను భేదమింకొకటి దోడయ్యెనే! కన్నవారికిఁ గాకపోయిన నా బ్రదుకెక్కైన నేమి? ఛీ! నూర్వురఁగనిన నేమి, వేవురఁగనిన నేమి? కడుపుచేటు గాక! ఏ క్షుద్రజీవి కింత సంతానము లేదు? హా, కశ్యపార్య, కఠి చెంతలేమి సుతులకెంత యులతినైతి. ఈదుష్టకోటింజూచి నాకడుపు దఱుఁగుకొని పోవుచున్నది.

నన్ను గాదనిన వీరందఱేమైన నాకేమి? రేపు ఇన[illegible]డుచేయు సత్రంబున వాసి హాలాహలమగుండంబునఁ బోయుపడనీ. దేహమంతయు మంటలు గ్రమ్మి, తలప్రాణము దోకలఁ జేరి, తప్పించుకొను నుపాయము లేక, మనసు మనసున క్రుగ్గుచున్నపుడైన నాకడుపుమంట వీరికిఁ దెలియవచ్చునేమో! ఛీ ట్టి మాతృఘాతకు లుండిన నేమి? మండిన నేమి? నేనింక నిలువఁజాల. ఈ శాపదగ్ధులముఖములు చూడఁజాలఁ. నాగతి నేఁ బోయెదఁ

గాక. ( అని నిష్క్రమింతురు. హాహాకారములు. )

శేషు—యద్భావ్యం తద్భవతి.

కరో—యద్భావ్యం తద్భవతి! ఒకదిక్కు మా ప్రాణవాయువు లెగిరి పోవుచున్నవి. తల్లి శాపము దప్పక దగులునందురు. అహో, మా దురితదుర్విపాక మేమనవచ్చు! జనమేజయుండట; సత్రంబట; హోమకుండంబట; మా మేనులు బ్రుంగుటయట. మా కన్నతల్లి కడుపుమంట జల్లార్పుట కింతకన్న సులభోపాయ మరయ జాలకుంటిమి గదా? మాతృసంరక్షణంబునకుఁగానివి, యే న్యాయసూత్రంబులు, నే ధర్మశస్త్రంబులు దగులఁబెట్టనా? మా కన్నఁ దీర్పరులెక లేరని విఱ్ఱవీగుచుఁ జర్వితచర్వణంబులు నుచ్ఛిష్టంబులైన శుష్క వాక్యకలంబులఁ జదివినంతనే లోకము మెచ్చునా, దైవంబిచ్చునా?

పినతల్లి పేరంటమునకు లోపము వచ్చునని దమ తల్లిం జంపుకొను వెంగలులు, మూర్ఖులు, కిరాతు లీకాద్రి వేయు లేనా?

శ్లో॥ నాస్తిమాతృసమాఛాయా
నాస్తిమాతృసమాగతిః
నాస్తిమాతృసమంత్రాణం
నాస్తిమాతృసమాప్రియా ॥

యని స్మృతులు బురాణములు బల్కుచున్న వే? 'మాతృ దేవోభవ' యని వేదము లుద్ఘోషింపుచున్న వే. తల్లిం బోనాడి సవతితల్లిం దలఁబెట్టికొనిన నిహము, పరమా? అంతటి నుశీలయే దైవనచో నీపణంబు లొడ్డుటేల? అశ్వము దెల్లగనుండిననేమి? నల్లగనుండిన నేమి? అశ్వంబు నల్లలేకున్న మా యమ్మ దనకేల దాసి గావలె? ఇట్టి విపరీతము లెందైనఁ గనిరా? వినిరా? దేశకాలపాత్రంబు లరయక, ధర్మాధర్మంబు లొక్క రూపయగు. అపాత్రంబగు ధర్మం బధర్మంబ యగుంగాని, ధర్మం

బు గానేరదు. ఇహపరములకుఁగాని ధర్మం బొండెడివేళ స్మృష్టిం
చువా రెవ్వరు?

'జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపిగరీయసీ' యని దొలిచేసు
వ్రులం జనువమే? ఇప్పట్టునఁ బరార్థము పరమార్థముగాదనియే
యెఱుంగునది. మీమీయాహ లేమైనఁ గానిండు. నేను నా
తల్లి ఖేదంబు వాపెద, నామెఋణంబుఁ దీర్చికొనియెద. కానిండు.

(నిష్క్రమణము.)

3 రంగము.—కద్రువ మందిరము.

కద్రు)—ఔరౌర, నా కన్నకడుపు పిల్లు గాలిపోయెగా? హా, యింకె
వ్వరు నాకు దిక్కు? ఈ మూర్ఖులలో నొక్కండైన లేఁడా న
న్నాలకించువాఁడు? నాకష్టము దీర్చువాఁడు? నా మాట యనిన
జవదాఁటనని దలఁచితినే! ఆ పొద్దుపొడుచునంతలో నెంతైన
సేయఁగలనంటినే? ఈ యవినీతుల నమ్మి చెడితింగదా? వేకువ
లేచి వేఁడుదెగడము లాడుదురే. వీరి కిప్పట్టున నీ యైకమత్య
మెట్లు గుదిరె? నాకై గుదిరెఁ గాఁబోలు.

అల్లదె ప్రదీపకళికగూడ నా కృచ్ఛముం జూడఁజాలనట్లు
వెల్వెలఁబాఱుచున్నది. నాబిడ్డల మేనిరక్తమె గడ్డకట్టెనా?
నా పాటు దప్పించువాఁడొక్కండైన లేఁడా?

కర్కో—(ప్రవేశము) తల్లి, లేకేమి? నీ కర్కోటకుఁడె నీయుండ నున్నాఁ
డు. లే లెమ్ము నీకష్టము దీర్ప వచ్చితి. వాలమూలంబున నేల?
ఆ యశ్వము నిలువెల్ల నల్లగఁ జేసివైచెద. ఆ మహేంద్రుని
గతి యేమయ్యెడినో దఱువాత.

కద్రు)—(నిదానించి, నిట్టూర్చి, కొడుకుఁ జేరఁదీసి,) నాయనా, యీక్ష
ణమెగా నేఁబుత్రవతినైతి. దాస్యనరకమునఁ బడనున్న నన్ను
దప్పించితివి. నీవె నాపుత్రుఁడవు. నాయాశీస్సు లన్నియు
నీయవియ. నేటితో నీఋణంబు దీరె.

ఇఁకఁ దెల్లవాఱినది. ఎండ దెరఁదీయకమున్నె నే నావిన
తను బిలిచికొనివచ్చెద. నీవా వాలమూలంబునఁ గాలసూత్రం
బునాఁ బట్టియుండుము. ఒక్కత్రుటిలో మనపని యయ్యెడు.

౪ రంగము- సముద్రతీరము:- కద్రూవినతలు- అశ్వము.

కద్రు—వినతా, మన పన్నిద మతిచిత్రముగ నున్నదే! ఆ హాయమే
నీకుఁ దెలుపై నాకు నలుపుగ నుండదు గదా? తెలుపైనఁగా
వలె, నలుపైనఁగావలె. విషమావస్థ ప్రాప్తించిన ట్లున్నదే?
దాస్యంబునకేమి గాని లోకములో నేమి నింద వచ్చునోయని
భయమగుచున్నది. మన యాంతరంగములు లోకులకేల? సవ
తులొండొరులు సహింపలేక చేసిరందురు.

కానీ, రోటితోఁ దలదూర్చి రోకటి పోటునకు వెఱచుట
గాదు? లోకు లేమైన యననీ, యొడిగట్టితి. అల్లదె, యాగ
నుపడునదేనా యశ్వరాజము ?

విన—ఆహా, యైయుండు. అక్కా, నీవనినట్లు నాకును గుండియల
దురుచున్నవమ్మా. ఒకతల్లి కడుపునఁబుట్టిన యాఁడుపడుచు
లకుఁ దీసి పోవని నెయ్యంబున నిన్నినాళ్లు మెలంగి నేఁడిట్టి
మాటపడవలసివచ్చె? మ్రింగరాని కడియయ్యెనే! దైవఘట
నం బెరికి దాఁటరాదుగదా!

కద్రు—అదేమే, మన పరీక్షకు నిలువఁజాలన ట్లా యశ్వము చెంగు
చెంగున దాఁట మొదలిడినది! అయ్యారె, మెఱపు మెఱసినట్ల
య్యె. ఆకళు కాలుఁ గదియుంచు టెట్లు? దాని వాలముం
దిలకించు టెట్లు? అదిగో, మనవైపునకే మఱలినదిలే.

విన—అక్కా, చల్లని యీగాలి కెఱటముల తాఁకున మేనులు పులక
లార్చుచున్నవి. ఇఁక నాతురంగమం బూరకుండు టెట్లు? దాని

యానంద మూ దాఁటులయుండ. దృష్టి నొకవంకఁ జేసి వల్గితగతి
నయ్యశ్వశ్రేణి వచ్చుటఁజూడఁ బ్రహ్మలక్ష్యంబునఁ గర్మబంధం
బుల విదళింపుచు వ్రాప్త, సాక్షాత్ ఆ శుకయోగిం జూచినట్లు
న్నదిగదమ్మా! ఎంతలో నెంతదూసినది! పిలచినట్లు వచ్చుచు
న్నదే. ఏమి చిత్రము!

కద్రు— రా, రా, యీగట్టెక్కుదము. ఇచట మన మెదురుగ నిలచి
నచో నది బెదరి యెటువోవునో. చపలుల కొకదిక్కునేమి?
(గట్టెక్కుదురు).

వినత— అయ్యయ్యో, నీమాటలలోనే మఱలిపోవుచున్నదే. మనమునకొ
నినది వినినాదేమి? అయ్యయ్యో!

కద్రు— పోనీ యాపాడుగుఱ్ఱమును! నేను జెప్పలేదా? నన్నుచేట
వంచించుటకే వచ్చినది గాఁబోలు నీమాయామృగము?
అదిగో, యదిగో, చూచితివా వాలమూలమున నల్ల?
చుట్టినట్లున్నదో చూడు, చూడు, చూచితివా? అంతయుఁ
దెల్లగఁజేసిన బ్రహ్మయాతోఁకం దీర్చి దిద్దలేక పోయెం గాఁ
బోలు. ఎవరో తలుము కొని వచ్చినట్లుబోవుచున్నది. ఆకొంత
మున నామేఘములపైఁ బడునా యేమి? సరి.

వినత— (చూచి, తలవంచికొని మఱలి సాగును. కద్రువ వెంటఁజేనును.
పదియడుగులు నడచి) అక్కా, యింక నేఁ జేయవలసినదేమి?
నాపణంబు నేఁజెల్లింతు నీకు సందియము వలదు. ఈక్షణమా
దిగ నేను నీకు వశవర్తిని వనుకొనుము. నీపాదము లంటిచెప్పెద.

కద్రు— చెల్లెలా, కానిమ్ము, లెమ్ము. ఈపణంబున కేమి? ఏమో,
మాటకుమాట యనుకొంటిమిగాని, దానిని నిలుపదీయవలె
నని నిష్ఠ నాకేమియు లేదు. నీదాసీత్వంబునఁగాని నేను ధన్యం
గాకపోను. లోకములో మాటయొకటి చాలు. కావలసిన దది.

వినత— ఆక్కా, నాకును గావలసిన దదియ గదా? నా వాక్పాలనమున
కెను రాదకుము. నీకు దాసినై ధన్యనయ్యెద.

# అమృతహరణము

## తృతీయాంకము

(విష్కంభము)

శేషుని మందిరము.

శేషు — ఆహా, యనుకొనినంత యైనది. నాడు మాయమ్మకుం దోడ్ప డుట ధర్మమా, యధర్మమా యని వితర్కింపుచుంటిమి. అధర్మ మని యకార్యమని పరిష్కరించితిమి. కాని మాతల్లికిం దోడ్పడ వలసినవాఁడు దోడ్పడియె. తెల్లనల్లయయ్యె. ధర్మం బధర్మంబుచే నోటువడియె. ధర్మాధర్మంబు లాయాకర్తలకు భుక్తంబులుగూడ నగుచుండె. రేపటి కొక్కవత్సరంబె పూర్తియయ్యెడుం గదా.

కాలగతి గానరాదండ్రు. కాని మాబోంట్లకది యచ్ఛమైన దర్పణంబు పోల్కినున్నది. మాభావిదశయంతయుఁ జిత్రము నందు వలెఁగన్నులఁ గట్టియున్నది. మాయమ్మ పండించిన ఫల ముల మేముగాక యీభువిలో భుజించువారెవ్వరు? ఎదిరిపక్షం బున నవ్వినతాసూనుండు నామె కాస్య ప్రభంజనుండాగరుడుండు బుట్టిపెరుఁగుచున్నవాఁడు గద! అతనిబలపరాక్రమంబు లమే యంబులు; దినదిన ప్రవర్ధమానములుగనున్నవి. పుట్టిననాఁ డె వాఁడు భూనభోంతరమ్ములం గలియదిరుగఁడె! నాఁడుగురి సిన కుసుమవర్షంబులు, నాఁడు మ్రోసిన దుందుభిధ్వానంబులు నాఁటిశుభనిమిత్తములన్నియు వమ్మగునెట్లు? అవియన్ని యు నావైనతేయునియభ్యుదయమునకేగాక మాకాద్రవేయుల విధ్వంసమునకును లక్షణంబులయ్యెడుం గదా! వానియమృతము మాకువిషంబగు టది యెట్టిదైవదుర్విపాకమో యెఱుంగరాకు న్నది. ఒక్కతండ్రికిగనిన సంతానమై సౌభ్రాత్రంబున మెలం గుచు లోకసంగ్రహణపారీణులమై యుండవలసిన వారమిట్లు జ్ఞాతివైరానలంబుజ్జ్వలింపఁజేసి దావంబునకు మహావనమట్లు పూ ర్ణాహుతిగావలసిన వారమైతిమి. కానిమ్ము. "అవశ్యమనుభోక్త

వ్యం కృతంకర్మ శుభాశుభం" ... ... అగరుడుఁడు విష్ణ్వంశ సంభూతుఁడు! మూర్తికొనుట. మాయాయుపులతోఁ దన తల్లి ఋణంబుఁదీర్చికొనఁగలఁడు. మహాత్ముండాతఁడు. జనని కానంద కరుండగుట గాదు. జగదానందకరుండె యగు. సందియము లేదు.



తృతీయాంకము.

౧ రంగము. కద్రూమందిరము.

వినత—తాతలిదండ్రులిడిన పేరు నేఁడు సార్థకమైనది. మాయక్క నన్ను 'వినతా' యని పిలిచినపుడెల్ల నాయవస్థ జ్ఞప్తికివచ్చుచున్నది. పరతంత్రనైతిని. నాఁడామాయమృగంబేలరావలె? దానికై నేనుపణంబేలయొడ్డవలె? ఒడ్డితిపో, లోకులందఱియట్ల నగలో నాణెములో వస్తువాహనంబులోగాక నాదేహము నేలయొడ్డ వలె? ఆకశ్యపార్యుం డడిగినచో నేమందును? ఎందుకీ పణము, పెట్టితినందును? ఆయన కేసుఖ మేమిలాభము గూర్చితినందును?

నాయవివేకమున నాయనూరుండట్టి వికలాంగుడై వందులకే యాతండ్రి యనరాని వేదన ననుభవించెనే! తన తపమంతయు వమ్మయ్యెనని విలపించెనే!

సంపూర్ణుఁడీ సుపర్ణుఁడు. ఆకశ్యపార్యుని యానఁదలనిడి యెట్లో వీనిం దక్కించుకొంటి.

వీనియోగము రాజయోగమనిరే? ఏయోగమో యిప్పుడే పట్టినది. నాఁటి శుభనిమిత్తములు, నావిప్రాశీర్వాదములు, నాకాలజ్ఞుల గణితములన్నియు నిరర్థకములయ్యెనా? ఆకశ్య పార్యుం డీకుమారుని ముఖమైనఁజూచి యెఱుఁగఁడే? పుట్టిన దాదిగ నేఁటికిఁ బదునాలుగువర్షంబులైననుఁ నాతపోధనునికి బిడ్డనిఁజూచుఁ బ్రియము పొడమదయ్యెనే? లేక నా యా

యకృత్యంబుఁజేయ నెరసి నాముఖముఁ జూడనొల్లక మిన్నకుండెనా? కాకేమి? తన యింటఁదారు దాసులగుట మాతల్లి బిడ్డల నుదుట వ్రాసెంగాక లోకములో నెందైన నిట్టి విపరీతము గలదా? ఆహా, యాగృహమేధికీజన్మలోఁ బాయని కళంకముం దెచ్చిపెట్టితిని. అడవులఁ దపముఁ జేయఁబోయిన వానిని యడవులనే యిలుఁగట్టి కాపురము సేయుమంటిని.

నాయపచారము వాపికొను టెట్లు? నాకెవ్వ రిట దిక్కు? నామొఱాలకించు వా రెవ్వరు? నాకష్టము లెట్లు గట్టెక్కు? ఈదాస్యాంబుధిఁ దాటించుఁ గర్ణధారుం డెవ్వఁడు?

సుపర్ణుఁడు (ప్రవేశము.) అమ్మా, నాగులు రమ్మనుచున్నారు. పోయివచ్చెద.

విన — నాయనా, ఎక్కడికెక్కడికో పోవలదు. వేగరమ్ము.

(సుపర్ణుఁడు నిష్క్రమణము)

ఈసుపర్ణుం డరుకొందునా, ముకుఁబచ్చలారని బాలుఁడు గదా? భూమిమీఁదఁబడిన దాదిగ దాస్యజీవియయ్యెనే! వీని కా బలపౌరుషములుండునా?

ఈదాస్యమున కావలియొడ్డు గలదా? ఏమని పన్నిదము సఱచితిని? ఏనాఁటికిది బాయవలయునంటిని? అట్టి యొడంబడికె లేమియు లేవయ్యె. కనుక నాకద్రువ దయాదాక్షిణ్యములె నాకుఁ బారంబయ్యె.

నాసుపర్ణుం డెన్నటికైన నన్నుఁ గడతేర్చునా? నాయిడుములు వాపునా? నే నెన్నటికైన మఱల నాకశ్యపార్యుని ప్రోల వినయాంజలు లర్పింతునా? నా కంతటి భాగ్య మున్నదా?

అహో, కాద్రవేయుల్లారా, మీకు మీజననికి నేజన్మమున నేమియపకార మొనర్చితిని? నాయనూరు నొక్కని బిలచిన నోట

మిమ్ముల నూర్వురఁ బిలుచుచుంటినిగదా! వాఁడశక్తుండగుట నాకును మీరె దిక్కని నెంచితిని! నాయాన లడియాపల య్యెనా? పుణ్యమునకుఁ బోవఁ బాప మెదురగుట, నాలిఖిత మిట్లున్నది గాఁబోలు. నాగతి యెట్లైనఁ గానిమ్ము. నాబిడ్డల కేది దిక్కు? వారలఁ జేకొను వారెవ్వరు? వారల క్షేమం బరయు వారెవ్వరు? నాదాసీత్వంబున వారలును దాసులయిరిగా? ఆయనూరుఁడు జన్మచేఁ బరతంత్రుండై యీసుపర్ణుఁడు కాలపరతంత్రుండయ్యె. ఎవరి కర్మ మెవరు దప్పింపగలరు!

కాని సహజసౌహార్దంబుననో, దేశకాల పరిజ్ఞానంబుననో యితఁడా కాద్రవేయులఁ దన భుజపీఠంబునఁ బెట్టికొని విధివిరామము లేకుండ సంగికిసేలకుఁ బరువులిడుచు, వారలకన్నఁ దాను బెద్దయైనట్లు ముద్దుసేయుచుండునే? వారలకైన దయరాదా? వారైనఁ దల్లికిఁ దెలుపరాదా? ఏమనుచుంటిని? చాలుఁబోలు. అప్పు చేసి మేసిన తీగలు గట్టున మేయునా? ఆ తల్లికొడుకులు గారా వారు? ఒకరిద్దరెట్లయిన నేమి?

ఆమె కేమి చేసితినని నాపై నింతపగ? కార్యవాదులకుఁ గారణ ప్రపంచంబులతో నేమిపని? వారల నడుగువారెవ్వరు? శాసించువారెవ్వరు? వారిది స్వామ్యము. మాయది దాస్యము. ఇంతియగావలసినది. లోకమును బాలించునది ధర్మమైయుండ నోపు. కాని లోకము ధర్మమునుం బాలింపఁబోదు.

ఇంతకు వారలు వీర లేమి సేయఁగలరు? ఆనారాయణుండె మాకు దిక్కయ్యెడు. తత్కృపాపాత్రుండయ్యెనేని నాసుపర్ణుండె వర్ధిల్లెడు. మాదాస్యమె మాకు శిక్షయయ్యె. ఇక మా ధర్మమే మాకు రక్షయు మోక్షము నయ్యెడు.

హా సుపర్ణా, హా పుత్రా! నాయెడ నొక్కక్షణమైననిలువడే

౩ రంగము—శక్రభువన మందిరాంగణము.

కాళింద, పింజర, వామన, శంఖ, పద్మ, బిల్వక, కుముద, సుపర్ణులు.

(కాళియాదులు సుపర్ణా, సుపర్ణా, యనుచు నందఱు బోయి పైఁబడుదురు)

సుప—ఓ, ఓ, ఓ, ఓ, (యనుచు నందఱి నిముురుచు బలుకరించును)

బిల్వ—సుపర్ణా, ఈవేళఁ గైలాసముఁ జూచివత్తము.

సుప—ఆట్లె గానిమ్ము.

శంఖ—కైలాసమున శివునిదర్శనముఁ జేయింతువా?

సుప—కైలాసమునకే బోయిన శివుని దర్శనముఁ జేయకుందుమా?

వామ—కైలాసమునకేమి? కడుపు నిండినప్పుడెల్ల కైలాసమే. నైమిశంబున బ్రహ్మసత్రంబుట. బలిహరణముఁ జేసివత్తము రమ్ము.

కుము—ఛీ, నీ యాలోచన లెప్పుడు నిట్టివె. కాదు. ఆచంద్రమామను జూచివత్తమురండు. మామ, మామ యనుటేగాని యొకనాఁడైన వానికడకుఁ బోమైతిమి.

పద్మ—చంద్రమామకేమి, ఎప్పుడైనఁ జూడవచ్చును. విభవముచెడి యున్నపట్టుననే మనము పోయి పైఁబడవలెనా? మహైశ్వర్యముతోనున్నవాఁడా మిత్రుఁడు. వానిం జూచివత్తమురండు.

కాళి,పింజ—మిత్రుఁడే, మిత్రుఁడే.

సుప—ఆ, మిత్రుఁడు మిత్రుఁడనుచున్నారు. మిత్రమండలమును దాఁకి మఱలివత్తురా? బీరములకుఁ బోకుడు.

పద్మ—బీరము లేరివో చూతము, రా. నీ వెగురుంబాలననక నావి బీరము లనుచున్నావా? అమిత్రుండుగాదు. అమిత్రుని మిత్రుఁడవ్వాఁడో చెప్పుము. వానిం దన్నివచ్చెదను.

సుప—చెడిపోదువునుమా?

పద్మ—నీవు చెడక నేను జెడదురా, చూడు, మఱి.

సుప—సరి, రంభా. లీలాద్రినుండి యేగుదము. (నిష్క్రమణము)

(కద్రువ ప్రవేశము)

కద్రు—అంగణమున నున్నట్టుండి యింతలో నెచటికేగిరో నాతండ్రులు? ఆసుపర్ణుఁడు బ్రాయమునఁ జిన్నవాఁడయ్యు బలదర్పంబుల మిన్న. వీరల నెచటి కెచటికో దీసికొనిపోవుచుండును. వలదని వారించినను వినఁడు. ఏవేళ నేమి బుద్ధిపొడమునో, ఏమిచేయునో, ఏమి వార్త దెత్తురో యని యనుక్షణము నే నద్రుచునే యుందు.

చిన్నవాఁడు, స్నేహమున మెలఁగుచుండునుగాని యాతల్లి యేవేళ నేమిబోధించునో? దానిమాయ లెఱింగినవా రెవ్వరు? అయినదంతయు దానిమాయవల్ల నేగద? ఏమిలేనివాఁడు నన్నుఁ జూచి యోర్వసితల్లి నేఁడోర్చియూరకుండునా? కాదు, కాదు. దాని దుర్మంత్రమేమో గలదు. తల్లికొడుకు లతివినయముఁ జేయుచున్నారు. కనుఁగలిగియుండినఁ గాని సేమము లేదు.

(నిష్క్రమణము)

పద్ముఁడు, కుముదుఁడు సోలి క్రిందఁ బడుదురు.

శాలి—అయ్యో, అయ్యో, సుపర్ణుఁడనినట్లయ్యెనే.

వామ—శంఖా, పోయి, యమ్మను బిలచికొనిరమ్ము. ఆమె కేమని చెప్పుదము? (శం, నిష్క్రమణము.)

పింజ—పద్మా, పద్మా, కుముదా, అయ్యో, శోషపోయిరి గాఁబోలు. సంజ్ఞఁగూడఁదప్పియున్నారే. సరియైన యుపచారముం దెలుపువారైన లేరే? (శంఖుఁడు ప్రవేశము). అమ్మకుఁ జెప్పితివా!

శంఖ—అమ్మయు మంథరయు వచ్చుచున్నారు.

(ప్రవేశము- కద్రువ, మంథర)

కద్రు— హా పద్మా, హా కుముదా (అని మూర్ఛపోవును)

(ప్రవేశము, శేషుఁడు, సుముఖుఁడు)

శేషు— నాయనా, ఏమి యీ దురంతము? ఎవరు దెచ్చిపెట్టిరి?

కాళి— తెల్లవారి యెప్పటియట్లు సుపర్ణుండును మేము వ్యాయామముల నుంటిమి. పద్మకుముదులును సుపర్ణుండును మాటమాటయును గొని మింటి కెగసిరి. మేము గన్నెత్తిచూచునంతలో నయ్యిరువు రాసత్పథమునుండి యంటుకొమ్మ పట్టుకొమ్మ లేక డుల్లిపడు చుండిరి.

శేషు—పింజరా, నీవు పోయి చల్లనినీటిని గొని తెమ్ము. తరువాత?

కాళి—వారి వెంట నాసుపర్ణుండును వచ్చివ్రాలె. పడినవారు పడినట్లున్నారు. ప్రాణములు గడఁబట్టెనో, కడతేఱెనో గూడ నెఱుఁగ రాకున్నది. అమ్మయు నిది విని వచ్చి మూర్ఛపడియున్నది. (శైత్యోపచారము చేయుదురు)

కద్రు—(తేఱి) హా పద్మా, హా కుముదా, నాతండ్రు లేమైరి? ఇంకను పడియున్నారా? కన్నెత్తి చూచిరా, మాటాడిరా?

కాళి—అమ్మా, శైత్యోపచారములఁ జేయుచున్నాము; సంజ్ఞరాలేదు.

కద్రు—నాయనా, సుపర్ణుండనుచుంటివే? వాఁ డేమైనఁ జేసెనా? వాఁడేడి? నీ నేమో మున్ననియే యడరుచుంటినే? సమయమున నే నాయన్నల వారింపనైతినే? ఏడి యాసుపర్ణుఁడు? తానేమి చేసెనో చెప్పిన నిప్పుడైన నాపాల్లు నేఁబడుదునే? ప్రాణములతోఁ గ్రిందఁబడవైచెనా, లేక ప్రాణముల హరించి త్రోసిపుచ్చెనా? నాబిడ్డలు బ్రతికియున్నారా? బ్రతికి రనుటకుఁ జేష్ట లుడిగియున్నవే? కాని కళలు దప్పకున్నవి. ఆసుపర్ణుఁ డేడి, యాదుష్పర్ణుఁడు? తనపని దీరినదని తల్లికిఁ జెప్పఁబోయెనా? హా!

సుప— (అంజలితో ముందుకు వచ్చి దూరముననిలచి)

అమ్మా! సుపర్ణుండనైనను దుష్పర్ణుండనైనను నేను కూడ నీపుత్రులలో నొక్కఁడను. ఆ పడియున్నవారు నాయన్నలు. వారిగతికిఁ గర్తను గాకున్నను గారణమైతిని. సూర్యతేజమున కోర్తుము, కానిపొమ్మని బలవంతము చేసిన వల్లెయని గొని పోయితిని. మార్గమధ్యంబుననే వారు పట్టువదలి పడిరి. మాటమాత్ర మనినచో భద్రముగ దింపి వేయనా? నాయజ్ఞానంబున నిది సంభవించె. వారఖండసత్త్వులగుట నీపాటునకు సొమ్మసిలి మాత్ర ముందు రని తోచెడిని. వారల ప్రాణములు వచ్చుట కామహేంద్రు నోర్చి యమృతమైనం దెచ్చి యిత్తు నమ్మరో నాపైనలుగకుము. నాయపరాధమింతియ; విప్పి చెప్పితి.

కద్రు—(నిట్టూర్చి) ఓరీ, నాబిడ్డలయుసురులు గొనినది గాక నీసంజీవనీ వ్యాఖ్యలతో నేమిపనిరా? మహేంద్రునోర్చి యమృతమాహరించు ప్రజ్ఞయే నీకుండిన నీపక్షంబులనున్న బిడ్డల జోడ నరయుమి నీకెట్లయ్యె? వారఖండ సత్త్వులని యీ విషమశోధనంబడఁద్రోసితివా?

హా, నేనీవేదన భరింపఁజాల. నాకడుపునఁ దీరని చిచ్చుఁ బెట్టించెఁగదరా, యీవినత? వారోర్చుమానినంత నీవివేక మేయేటం గలసె? వారిప్రాణములతో నీప్రాణంబులు గూడ దహించుకొని పోవునను వెఱపైన నీకు లేకుండెనా! వారలు చచ్చినఁ జాలు, నీవెట్లైనను దనకు విచారము లేదని మీయమ్మ చెప్పి పంపెనా? దానికి నీవియ్యకొంటివా!

ఇంత మత్సరము నీకేటఁబుట్టె? నీతల్లి నీకుగ్గునఁ బాలువోసెనా? వెచ్చవెచ్చని మచ్చరంపు నీరువూసెనా? నీ వెఱుంగవు? త్రాగి త్రేన్చితివి గాక!

హా, నా బిడ్డలపాలిటి యముండ వైతి గదరా? నీ క్రూర వీక్షణములకు నాకె వెఱ పయ్యెడినే? నా బాలు రెట్లు సహించిరో? చివరకు నీ మాయపట్టు వదలి పడుచు వారెంత పరితపించిరో? హా, దైవమా! వారి భారమే మోయలేనంత విశీర్ణములయ్యెనా నీ సుపర్ణములు?

ఈ దురంతమునకుఁ గారణమవు గాని కర్తవు గావా? మా పాలిటి పాడుకర్మంబ వైతి వది చాలదా?

ఔరౌర, బిడ్డలఁజంపి సభందిరుగుట కాతల్లి గాడువైతి గదరా?

దుష్పుత్త్రుండనిసంతఁ బొందుచుఁ గొనివచ్చెనా? అంతరోషముగలాడ వీపాపంబున కేల యొడిఁగట్టితివి? నృశంసాధమా, ఛీ, నీ మొగ మావలఁ ద్రిప్పుము. నీ తల్లికీకథ నెఱిఁగింపుము. దాని ద్రోహము దానినిఁ గట్టి కుడుపక పోదనుము. ఇఁక నా కడపఁ దాటిన నమ్మన వేయింతు. నా యెదుట నిలువకు. వెడలి పొమ్ము.

నాయనలారా, తమ్ములకు మీకు నేఁటితో ఋణముదీరెనా?

శేషు— అమ్మా, ఆపత్తునఁ గ్రియ లరయందగునుగాని మాటలతో నేమిపని? ఇంకను వారి ముఖంబులఁ దేట యెప్పటియట్లున్నది. చైతన్య మెట్లు వచ్చునో చూడవలె. ఏ దేవునికి మ్రొక్కుదువో? మన శైత్యోపచారము లందుట లేదు.

కద్రు— నాయనా, ఏ దైవముం గొలుతము? ఏ దేవునికి మ్రొక్కు లిడుదము? ఏ భూతనాథుండు మన కండ యయ్యెడు? సూర్యతేజంబునఁ దప్తములైన వీరి మేను లాపర్జన్యుని యనుగ్రహంబున నేమైనఁ జేయునేమో? భో మేఘవాహన, అమృతవృష్టిలవం బొందు బఱపి పుత్త్రభిక్షం బిమ్మా: నాపాటి దీనలఁ బ్రోచుట గాని నీ మేటిధర్మము? ముల్లోకంబులు నీ వజ్రి

సరి, సరి, నాతో నయ్యోవా? నా తల్లి గూడఁ దనకు ద్రోహం బొనర్చెనఁట! "దాని ద్రోహము దానిని కట్టికుడుపునఁట" ఔరా, యిన్ని యనరాని మాట లనియెనే! ఈ యవాచ్యములకు గత మేమైయుండు? నా తల్లి దన కేమి ద్రోహ మొనర్చెనో?

ఈ వేళనే గాదు. నన్నుఁ జూచినపు డెల్ల, నాతల్లి ప్రశంస వచ్చినపు డెల్ల నేలాకో యీమె భ్రూభంగంబులఁ జేయుచు మొగ మావలఁ ద్రిప్పుచుండె. ఏమో హృత్తాపంబు లనుకొనుచుంటి. కాదు, కాదు. మమ్ము దహించుట కీర్ష్యానలం బొం డీమె యంతరంగమునఁ దాఁగియున్నది. ఇంతవఱకు మూర్ఖుఁడనై, వెఱ్ఱినై గుర్తింపఁజాలకుంటి. అప్పుడుఁ జీఁకటిం బడియుంటి. నేఁ డీ విస్ఫులింగముల జాడం బట్టి పోయెదగాక.

ఔరా, నాకీ బుద్ధిజాడ్య మెట్లు గలిగె? "పరేంగితజ్ఞాన ఫలాహి బుద్ధయః" యనునట్లు పరేంగితం బరయఁజాలని నాకీ బుద్ధిప్రశయం బెట్లు సంభవించె? పోనీ, యాకద్రువ క్రౌర్యము గ్రహింపఁజాలకుంటి. నాతల్లి దైన్య మదెట్లు తెలియకుండవలె? ఆమె ఖిన్నవదనంబుఁ గాంచెనో? నా మూర్ధాఘ్రాణము సేసి బాష్పకంఠయై గద్గదిత యగు టెఱుంగనో? క్రీడోన్మత్తుఁడనై స్నేహబాహుళ్యంబున వారల నీరలఁ బట్టుక దిరుగాడుచుంటినే గాని యొక్కనాఁ డామె యుత్సంగంబునఁ జుండిఁ 'తల్లీ నీ దుఃఖమేమి' యని యడుగనైతినే?

ఔరౌర, యింత స్తబ్ధుఁడ నైతినే? ఇంత యచేతనత్వం బెట్లు గలిగె?

కలుగ కేమి? ఇప్పుడ గదా.

చూ కద్రువ పరుషాతిపరుషంబుల నన్నుఁ జేజివిడిచె? దాని కేమంటి? ఏమి సమాధాన మొసంగితి?

శ్రుతిసమ్మేళనము లేని తంత్రులపోల్కి నా హృదయనాళములు చిందఱ వందఱలాడెనే గాని యొక్క స్థాయిం జేరకున్నవి గద? సంకల్పవికల్పంబులకిటులనే యయ్యెడిఁగాఁబోలు!

[నారదుఁడు— ప్రవేశము]

నార — అహాహా! కుమారా! నీవేనా మా కశ్యపుని వంశోద్ధారకుఁడవు? సుపర్ణుఁడవఁట?

సుప—స్వామీ, చిత్తము. నన్నె సుపర్ణుఁడందురు.

నార—కుశలమా-నీకును మీ తల్లికిని?

సుప—భవదనుగ్రహంబునఁ గుశలము.

నార—ఓహో, మా యనుగ్రహంబుల కేమి? ఆ కద్రువ యనుగ్రహం బుండవలెఁగాక! అది యుండఁ జూచికొనుము. వీరివారల విడిచి నీ విచట నొంటిగ నుండ గతం బేమి? ఏదీ, యిటు చూడుము. ఆ బొమలు ముడివడియున్న వేమి? ఏమా పెద్దమ్మ నిన్నేమైన యనెనా? ఆహా! యట్లే యున్నదే? ఏమోయి సుపర్ణా, ఇంకెన్ని నాళ్లు వినాయమ్మకీ చుమ్మలు? కొడుకులు సమర్థులైనఁ దలిదండ్రుల యిడుములు బాయుట యెందైనఁ గలయదిగా? బాలప్రాయమున నాటపాటలఁ దగిలియుంటివి గాక, లోకము 'భళీ' యనునట్లు సకలవిద్యలం దేరి సముజ్జ్వలతేజుండవై, సుసాధ్వి యాతల్లి యట్లు సవతాలికి దాసియై గుంది కృశించుచుండ నిసుమంతయేని చింత వంతలేక విలాసాలసుండవై నీవిట్లు ద్రిమ్మరుచుంట లెస్సయాగునే? 'పురుషః పురుషార్థవాన్'. ఇది యొక పౌరుషమా? ఈనీచాశ్రయంబునం గాని గతులులేవో? 'జీవనం మానమూలంహి'. ఇంత మానవిస్మృతి నీ కెట్లు గలిగెనోయి కాశ్యపీ? ఇంత బుద్ధిజాడ్యము నీ కెట్లేర్పడియె! కాదు, కాదు. నీ వంటి కుమా

రున కిది వర్తనము గాదు. తామసింపక ముందు నీ వా తల్లి బంధమోక్షణం బొనర్పుము. ఆమె ఋణముఁ దీర్చికొనుము. అదియె మాకెల్లరకుం బ్రియము.

ఏకాంత సేవనంబునఁ గాదు. పోవుదము రమ్ము.

---

౪ రంగము—కద్రూమందిరోద్యానము.

విన—మా యక్క యింద్రోత్సవముం జేయునఁట. దానికి వలయు సంస్కరణాదిక మంతయు నాపైఁ బెట్టె. నే నేమి చేయుదాన? సహజముగ నట్టి కల్పనలదెస బుద్ధి పోవనే పోవదయ్యో. అటులైన నీ దురవస్థం బడి యున్నమతిగూడఁ బోయె. గాలిలోని దీపమట్లు మనస్సునకు స్థైర్యమే గలుగదు. స్ఫురణ యంతకన్న లేదు. అట్లే యేదేని చేసితినో యామెకు దానం దప్పులే దోఁచుచుండు. చేయకున్న నంతకంటెఁ దప్పగు. అసిధారావ్రతమైనది యీ బ్రదుకు.

ఎవరికేని దాసులపై నొకనాఁటికిఁ గాకున్న నొకనాఁటికైన దయ గల్గుట కద్దు. నా పురాకృత మెట్టిదో నాఁటికి నాఁటికి మాయక్కకు నాపై వైరమే పెరుఁగుచున్నది. ఆమె తామసమును నే నెట్లు భరింతును? ఎన్ని నాళ్ళు భరింతును? ఆమె నెట్లు మెప్పింతును?

పనిపాటు లెవ్వైన నే నొక్కతె చేయుచుంటి. వినయవిధేయతలఁ బరగుచుంటి. నా బిడ్డనికన్నఁ దన బిడ్డల నెక్కుడు ముద్దుసేయుచుంటి. ఏమి చేసియు నామె పరుసముల నాపఁ జాలనైతి. నీ బిడ్డ లెంత బలవంతులే యను. నీ ద్రోహము నిన్ను గట్టికుడుపు ననె. నా బిడ్డలు బలవంతులై యేమి యుపకార మొనర్చితి రనుకొందును! నే నేమి ద్రోహ మొనర్చితి ననుకొందును! ఎంత యోజించిన నేమియు నగుపడదయ్యో. చిత్తము

శూన్యమై యింత భరముగ నున్నదే! ప్రాణములు కంఠగతములగుచున్నవే?

హా పరమేశ్వరా, యీ వెతలు బాయు టెన్నటికో గదా!

[ప్రవేశము— సుపర్ణుడు]

నాయనా, (మూర్ధాఘ్రాణము సేయుచు) ఒక క్షణమైన నిలచిన చోట నిలువవేమోయి? నీవు గాకున్న నన్నిచటం బిలచువా రెవ్వరు? మాటలాడువా రెవ్వరు? ఎవరితో నేను నివెప్పు కొందును? ఎవ రాలకింతురు? ఈ పాపకర్మురాలి గర్భమునం బుట్టి నీవుగూడ బానిస వైతిగదోయి తండ్రీ!

సుప— అమ్మా, పరుల పంచే నుండుటేల? బానిసల మగుటేల? మన కిచటం ప్రభులెవ్వరు? మనమేరికి దాసులము! మన దారిని పోయినం బోదము గాక. నీవు వగవం బనిలేదు.

విన— తండ్రీ, మన కిచట నన్యులు మాత్ర మెవ్వరు? అన్యులు నాత్మీయులు మన కొక్కటే యైరి. ఎవరు ప్రభులైనను గాకున్నను మనము దాసుల మగుట తప్పదు. నిర్భాగ్యురాలను నాకడుపునం బుట్టిన నీ కిదియ పిత్ర్యమయ్యె. నే నేమి చేయుదును?

సుప— అమ్మా, నీకు వగవంబనిలేదంటిని. ఇపుడే కదలుము. ఏ దెసనైనం బోవుదము. మన నాపువా రెవ్వరు?

విన— ఆపువా రెవ్వరందువా? వారు వీ రననేల? మీ యమ్మపుత్రరాక్ష్యతమె గొండయై నిన్నాపును. తండ్రీ యిన్నినాం డ్లీరహస్యమును దాచితి గాని యింక దాంపజాల. నే నిచట దాసిని. నీవు దాసీపుత్రుండవు. ఆ కద్రువ నాసపత్ని. మీ తండ్రి కశ్యపార్యుండు తపమునకు బోయిన యెడ మే మిరువురము పన్నిదము సలిపి నే నం దోటువడి నాతోడునకు దాసినైతి. నిన్నుం గంటి.

సుప—అమ్మా, ఆమెకు దాసి వగునంతటి పన్నిద మది యేమి?

విన—నాయనా, ఒకనాఁడు విహారమునకుం జనితిమి. ఉచ్చైశ్శ్రవం బంత దవ్వున మేయుచుండె. ఆమె చూచి 'యదె! యాతనితోఁక నల్లయనె. నేనుజూచి నల్లం గానక నల్ల లేదంటి. 'ఉండిన నొత్తు' వనె. లేదని నా దేహము నే యామె కిత్తునంటి. అనాఁటికిఁ బొద్దుగ్రుంకిన దని మఱునాఁడు డాసి చూచితిమి. ఆవాలమూలంబున నల్ల యొకటి చుట్టిన ట్లుండె. నాఁడు మొదలు నే నీయూడిగమున నుంటి.

సుప—ఆహా! ఇపుడంతయుఁ దెలిసె. ఈ యుదంత మెఱుంగక యిన్ని నాళ్ళు మోహపంజరమునఁ బడియుంటి. ఇఁక నుండరాదు, ఇఁక నుండరాదు. అమ్మా, నీ వీ కర్మముం దెచ్చిపెట్టుకొంటివని కుందం బని లేదు. నీవు నేనన నేమి? యావల్లోకము గర్మవశము. కర్మయే దైవమండ్రు. కాని, తల్లీ, యిప్పు డీ దైవముతోఁ దలఁపడి ప్రాణముల్లైనఁ గోల్పోవుదును గాని యీ దాస్యబంధమునఁ బడియుండ నోపను. ఈ నీచపుఁ బనులం జేయనోపను. ఈ యవమానముల భరింపనోపను.

ఈప్రొద్దాయమ్మ యాడిన మాటలు క్రూరనారాచములై నాహృదయమును భేదింపుచున్నవి. సుపర్ణుండను గాను దుష్పర్ణుండనఁట! తన బిడ్డలపాలిఁటి యముండనఁట! నా రూక్షవీక్షణములకుఁ దానె భయపడునఁట! ఎవ్వరీ విషముఖ నన్ని కాఱు లఱచుటకు! సహవాసదోషముచేఁ దనబిడ్డల ననుదినము వెన్నిడి మోచితిని గాని సమయింపనెంచినఁ దన గుంపునంత నొక్కపెట్టునఁ జీల్చి చెండాడకుందునా!

విన—తండ్రీ! నిదానింపుము. నీ వెన్నఁ డింత యాగ్రహముం జెంది యెఱుఁగవే? నేఁ డేమి దాపరించె? ఆయమ ని న్నేల దూషించె? ఉన్నది యున్నట్లు చెప్పకుండిన నా యాన.

సుక — నన్నా నాగులు పంతముఁబట్టి మిత్రసుండలమునకుఁ గొని పొమ్మనిరి. సగము దూరమైన నరుఁగకమునుపే తాపమున కోర్వలేక క్రిందబడిరి. ఇదిచూచి నేనును వారి వెంట వచ్చి వాలితిని. దాని కా యమ్మ నే నేమో వారలఁ జెలకట్టి చంపితినని, నేను నృశంసుండనని, నా మొగముఁ జూడఁబాప మని కాళరాత్రియట్లు గర్జించె. లోకమర్యాదకు వెఱచితిని గాక లేకున్న నా క్రొవ్వ నీ నఖముఖములఁ గండలు దీసి యుందును. కుత్సితులు, కృతఘ్నులీ పాపులతో నా కేటి పొత్తు? ఈ యధముల సేవ నాకేల? వీరి పాటి బలపౌరుషము లైఖుంగనా? వీరి జవసత్త్వములె నాకుఁ గఱవయ్యెనా? అంగణమున నిల్చి నా యీ ఱెక్కలార్చినం జాలు నీ కులమంత యుఁ బటాపంచలై పోవదా? వీరి శస్త్రసంభారముం జూచి యుఁ బెంకుదు ననుకొనిరి గాఁబోలు. 'మతిరేవ బలాద్గరీయసీ' యని నాకడనున్న యవి దివ్యాస్త్రంబు లమోఘము లప్రతిహతములు. కాలమునకుం గట్టువడితిఁ గాక నేఁడు నా కిచటఁ బ్రభులెవ్వరు? నన్ను శాసించు వా రెవ్వరు? నాకు నేన ప్రభుఁడ, నేసర్వస్వతంత్రుఁడ, స్వరాట్పురుషుఁడ. నా మనోరాజ్యం బరినిష్కంటకంబై యున్నది. స్వారాజ్యాధీశుం డా పరమేశ్వరుండు దక్క నన్ను శాసించు వాఁ డీరేడు లోకంబుల నహి నహి.

అహహా! దాస్యపిశాచమా, ఏమఱి ధర్మువు దప్పినపుడే వేళ మమ్మావహించితో నేటితో నీ యుచ్చాటనం బయ్యెడు! శాంత, సుశీల, యమాయిక యగు నాతల్లియా, నీ కూరిర లోభంబున కెరయయ్యె? నాఁడు నే నజ్ఞాంబున నుంటి. నాతల్లి కీ భారము గల్పించితి. ఇప్పుడిఁక నీ చేష్టలుడుగుము. నీమాయలఁ గట్టిపెట్టి నీ పెటు చొచ్చితో యటులనే పొమ్మా.

ఆహా, కాద్రవేయులారా, నా తల్లి దురదృష్టంబున మీకు మీయమ్మకు దాసియయ్యె. మీరు మాకుం బ్రభువులైరి. ఇప్పుడింక మీ కేక మైన దని యెఱుంగుదురా? మీ యమ్మ నాటిన విషబీజము వృక్షంబగుటం గాంచితిరా? అదిగో, యా పండిన ఫలములు కాలపురుషుండు మీకై మోయలేక మోయుచుం దెచ్చుచున్నాఁడు.

ఔరౌర, మీ తల్లి యేఁడువు; వివేకము చెడినం జెడుంగాక. ఈ విపరీతబుద్ధి మీ కెట్లు జనించె? మీ తల్లి దురాగ్రహము నరికట్టు మానిసి మీలో నొక్కండైన లేఁడయ్యెనా? మీ తల్లి తమవాతం దల్లిగద! మీ యయ్యకు నిల్లాలు గద! మీపైఁ బ్రేమ నిండియుండుంగద! ఇట్టి నా తల్లిని మాయదాస్యంబునం బడఁద్రోసి, కుడుపరాని క్లేశంబులం గుడిపిన కర్కోటకులరు మీ ఘోరపరిణామంబు లీ కన్నులవంతువుగఁ జూచెదంగాక! భిన్నగర్భజనితులమయ్యు గాఢానురాగంబున మెలంగ వలసినవారలకు మీకును నాకును జ్ఞాతివైరంబె రగిలె. సాధుల కోపం బిది. దీనిం జల్లార్ప పర్జన్యుం డింక లేఁడు. మీ యంతముం జూడక నిది శమింపదు.

తల్లీ, నాకు సెలవొసంగుము, పోయివచ్చెద.

విన — తండ్రీ, అతిసాహసంబున నాపదలు వొదలు. హృదితతుండవైన నీకీ యమర్షణంబు భావ్యంబ గాని దేనికైన వేగిరపడరాదు. అందులో వారు బలవంతులు. దర్పవంతులు. వారనేకులు. నీ వేకాంగివి. నీ సత్వలేశమె యత్యయ్యమగుంగాక. అయినను కార్యంబుపట్ల దేశకాలములం జూడవలె. ఉపాయంబు లరయవలె.

తండ్రీ, నీ యగ్రజుండనూరుం డట్లయ్యె. నీవె కా నా

దాస్యభంజనక్షముఁడవు? నాఁ డాతఁడు చెప్పిన మాటయు నదియ. దానికే నిరీక్షించుచుంటి.

నీకును వారు చిన్ననాఁటఁ గోలె భ్రాతృస్నేహంబున నున్న వారు సామదానంబులఁ జెప్పిచూడుము. కాకున్నఁ జూతము. ఆర్తత్రాణపరాయణుం డా విష్ణుండె నీకుఁ దోడయ్యెడు!

---

౫ రంగము: సుపర్ణుఁడు

**సుప** — కంకణముం గట్టితి. ఆ సిటలాత్ముం డెత్తివచ్చిన నీ పట్టువిడు వరాదు. దాస్యాంబుధిం దరియించుటో దానం బడి మునుం గుటో రెండేగతులు. 'శుక్లకృష్ణేగతీ హ్యేతే'.

పోనీ, ఈ దాస్యం, బీ కింకరత్వం బేరికని హాష్రింతు? ధర్మ స్వరూపులా భూసురుల కనియా? సురారాధ్యుం డా పర మేశ్వరు నికనియా? ఈ రెండిఁటం గాక యిహంబున దాస్యం బనుచితంబ యగు. ఇట్టి కుటిలులు నహంకారులు దుర్మదాం ధులీ విషముఖులకుఁ జేయు దాస్యం బనార్యము, అపౌరుష ము, జుగుప్సావహంబునుం గాదె?

ఛీ! యీ యావరణం బెదుష్టంబయ్యె. క్షణమే నిచట నిలు వందగదు.

పోయి యా శేషు నడిగెద. అతఁడు వివేకి, ధర్మరతిగలఁ డందురు. అతని యుద్యోగంబునఁ గార్యసాఫల్యం బయ్యెనా, సరి; లేకున్న నిదె నా క్షాత్రంబె యంతయు సాధించు.

ఈ మహాశైలము నుఱుమాడి నుగ్గుఁ జేయ నా యీ వజ్ర నఖం బొక్కటి చాలు. చిన్ననాఁటి నుండియు దీనిం బెంచి పెద్దఁజేసితి. నేఁ డిది చరితార్థత నొందిన నొందు. కానిమ్ము.

---

౬. రంగము — కద్రూమందిరము. శేషుఁడు, తమ్ములు.

శేష — తమ్ములారా, గతంగతమని యైనదేమో యైనది. ఇఁకనైన మన మాతృహిత మెఱుంగకుండు టనుచితము. మన యమ్మ యాగ్రహామునకు వెఱచి నాఁడె యామె చౌర్యమును వారింపమైతిమి. నేఁ డది మన పాలిఁటి మృత్యుదేవత యయ్యె. ఆ రాత్రి వీక్షణములఁ జూచితిమే గద మొన్న నాయమ భయోద్విగ్నయై యేమేమో మతి చెడినట్లు మాటాడఁ దొడంగె.

ఆ సుపర్ణు నారక శపియించెఁగా! తన బిడ్డలపాలిఁటి యముం డనియెగా! ఆహా! ఆ మాటలు వినుచుండ దివ్య లోకసమున 'తథాస్తు' ని నట్లు నా మనోవీధిం దోఁచె. ఆ సుపర్ణుం దూఱి నవి దూఱులు గావు, స్వకులసంహారప్రేరకంబు లగు మంత్రోచ్చారంబులు గాని. ఆ యక్షరాక్షరంబునను మన కుల సంక్షయబీజంబులె నాకుఁ బొడఁగట్టె. రోషావిష్టుఁడైన యా సుపర్ణుం దలఁచిన నాగుండియ లవియుచున్నవి. శమదమాది గుణసంపన్నుం డగుటఁ దామస మూడంచి లోలోన వగచెం గాక లేకున్న నా క్షణమె మనలను మన యమ్మను గ్రక్కునఁ గబళింపకుండునా? సాధుసంతాపం బూరక పోవదు. సుసాధ్వియా వినతను వంచించి యామె హృదయసీమం బెట్టిన శోకాగ్ని యొక్కటి చాలునే మన కులప్రళయమునకు? దాని కిఁ దోడుగ నీ వికృతమారుతోద్ధతి యిది యేల? దానిం బ్రజ్వలింపఁ జేయుటకా?

అహాహా! యీ తల్లి కీ విపరీతబుద్ధి యేల జనించె? ఇది వారించు వా రెవ్వరు? తమ్ములారా, నేఁజెప్పవచ్చిన దిది. ఆ గరుడునితోడి వైరము మనకు వలదు. దాన మనకు హాని వాటిల్లుట తప్పదు. అతని సత్వ మజయ్యము. అతని ధాటికో

ర్భవా కేభూమింగాని లేదు. మన తండ్రి తపః ఫలంబునాఁ గలిగినవాఁ డాతఁడు. తద్దారుణజ్వాల లెగసినచో మనలను గాల్చి నిలువున నీఱుఁ జేయకుండునా! ఆజన మేజయుండు వ్రేల్చు హోమగుండంబులతో నేమిపని ?

బలవంతునితోడి పగ బలహీనుల కంతమే గా? ఇఁక నాతఁడు మనపజ్జ నుండెనో యతని రక్ష మన కంగరక్షయగు. అతని స్నేహంబున మన తేజం బఖండమై వెలుంగు. ఇరువుర మేకమతింజరించిన నీముల్లోకంబుల మన కెదురాడు వారుండరు. మన కెద్దియు నసాధ్యం బుండదు. ఆమహేంద్రు నోర్చి యమృతకలశంబె గొనితెమ్మని నను దేఁగల తేకువ గలవాఁ డామహామంత్రోత్తముఁడు.

[కర్కోటకుఁడు దల్లికిఁ జెప్పఁబోవును.]

పోనీ, యాతఁ డెవ్వఁడో పరుఁ డనుకొందమా? ఆత్మీయులలో నాత్మీయుఁడగు ననుజుండుగదా. మన తల్లి కీతఁ డెట్టి వాఁడైనఁ గావచ్చుఁ గాని మన తండ్రి కాతఁడు, మన మొక్క రూప యగుదుము గదా. ఆయన కీ వృత్తంబంతయుఁ దెలసిన నెంతకుందునో?

కావున నెప్పట్టుననైన మన కీతనితోడి వైరం బకార్యంబ యగు. [కర్కోటకుఁడు-ప్రవేశము]

ఆతల్లి కొడుకుల రక్షించినదియే మనకు రక్ష, వారల శిక్షించినదియే మనకు శిక్ష యని నామతము. వారల నిప్పుడఁ జెఱలం బాపుదము. వానిం దమ్మునిగను మనలో నొక్కనిగను భావింతము. వాని ప్రాపుంగొని పదినూ ఱేడులు బ్రతికిపోవుదము. లేకున్న మనకు మరణమే ధ్రువము.

కర్కో — సోదరులారా, అగ్రజుని మాటలు మీరంద రాలకించితిరి గదా. పరు లెట్టివారైనఁ గానిండు. మనలను మనము దిగనా

డుకొనుట హితమని నా కనిపించుట లేదు. ఒరులగుణముల భూషించినంత మన మధికుల మైనాఁటికిఁ గాఁబోము. ఎవరి గుణదోషములు, ధర్మాధర్మంబులు వారివ.

ఆ తల్లి కొడుకులఁ జెఱలం బెట్టిన వా రెవ్వరు, వారి పురాకృతము గాక? ఆ యమ్మ కాబుద్ధి పుట్టె; యది యట్లయ్యె.

ఇప్పు డాకొడు కంత బలవంతుండే యైన నిఁకఁగావలసిన దేమి? తల్లి చెఱం బాపు; తన చెఱం బాపుకొను. వలదను వా రెవ్వరు?

నన్నాతఁడు చంపునను భయము నా కొంతయైన లేదు. ఈ ప్రాణంబు లేఁదెచ్చినవిగావు; ఏ నిచ్చినవి గావు. బలవంతుం డెవ్వఁడో వాఁడె వర్ధిలఁగలాఁడు. వర్ధిలందగువాఁడు. నా కదియ ధ్రువము. (నిష్క్రమణము.)

[illegible]—సోదరులారా, మన యగ్రజుండు ననుజుండు నొక్కొక్క రొక్కొక్క ధ్రువముం బట్టిరి. అన్యలోకాశ్రయంబునం గాని వ్యవహారంబు గానోపదు.

ఆ సుపర్ణుండు బలవంతుఁడని, సంకల్పించిన, మనసందఱ నొక్కుమ్మడి మడియించునని మాయన్న యనుచుండె. బలవంతుండైనందుల కది గాదు గార్యము. బలవంతుం డెప్పట్టున బలహీనులఁ గావవలెఁ గాపాడవలెఁ గాక.

[కర్కోటకుడు— ప్రవేశము]

ఏదీ, తానెయనిన ట్లాబలవంతునిఁ బోయి, యామహేంద్రు నోర్చి, యాతనిగుప్తిచున్న యమృతకలశముం గొనితెచ్చి మా కిమ్మనుము. బలహీనుల మగుట సత్యము. మా కీ యుపకార లేశంబున వాని కజరామరంబైన యశంబె చేకూరు. సందియము లేదు. తల్లి దాస్యంబు వాయు. అంతవాని కది యొక పనిగాదు.

పద్మ—సాధు, సాధు.

కర్కో—నాకు మాయమ్మకు నదియే సమ్మతము.

బిల్వ—మాకందఱకు సమ్మతము.

[దౌవారికుఁడు—ప్రవేశము.]

దౌ—దేవర దర్శనార్థ మాసుపర్ణుఁడు వచ్చియున్నాఁడు.

శేషు—ఆహాహా, ఆడఁబోయిన తీర్థ మెదురైన ట్లాతఁడె వచ్చెనా? రా, రమ్మనుము.

తమ్ములారా, మీయభిమతం బెఱింగించెద. అతఁ డియ్యకొనిన నిఁకఁ బ్రత్యాఖ్యానంబులతోఁ బనిలేదు.

[సుపర్ణుఁడు—ప్రవేశము.]

సుప—భ్రాతృవరులకు నమస్కారము.

శేషు—స్వస్త్యస్తు. తమ్ముఁడా, సుపర్ణా, ఆసీనుండ వగుము. ఏమి, త్వరితగతిం జనుదెంచినటు లున్నది? గత మేమి?

సుప—అన్నలారా, మాతల్లి యపరాధంబునకు మే మిన్నినాళ్లు మీ దాస్యం బొనర్చితిమి. తప్పాలే దొప్పాలేఁ జేసితిమి. ఇప్పు డిఁకఁ దరణోపాయం బెద్దియైన గలదో లేదో యానతిండు.

ఈ పారతంత్ర్యం బే నొల్లను. నా ప్రాణంబులనైన మీ యరచేతం బెట్టి దానిం బాపుకొనియెదఁ గాక. మీయభిమతంబు సెలవిండు.

తక్షు—సుపర్ణా, దైవయోగంబున మే మిచ్చినది నీ వడుగునదియు నొక్కటి యయ్యె. మీ దాస్యంబు వాపుకొనుట మా కెల్లరకు సమ్మతంబ. అందు కొంతయేని యాక్షేపంబు లేదు.

అయిన నీ పతులభుజాబలుండవు. నీ జవసత్త్వంబులు మాకు లేవు. మాకొక్క చిన్నికోరిక గలదు. దానిం దీర్చి మమ్ముఁ

కృతార్థులుగఁ జేసి నీవును గృతార్థుండవు గమ్ము. నీవంటివాని కది యొక్క లెక్కగాదు.

సుప—అన్నలారా, ఈ వ్యవహారంబున నాప్రాణంబులె యొడ్డితిని గదా? మీ కింకను శంకయేల? మీ కోర్కులఁ దాఁచక చెప్పుఁడు. నాశక్తిసామర్థ్యంబు లన్నిట యత్నించెద. ఆ విష్ణుని సాహాయ్యంబున సకలము సాధ్యం బయ్యెడు.

శేషు—తమ్ముఁడా నీసాహసంబునకు నా మనం బెంతేనియు లరుచున్నది. నీవును నా యనుజులలో నొక్కండవు. నీవు మాకు ప్రియంబొనఁగూర్పుము. నీకును మాకును సఖ్యం బయ్యెడు. కాళ్యపు లొక్కరై రనిన నా మహేంద్రుండె గద్దియపై వడంకు.

నాఁ డనినట్లు, నీ వప్పు డాతని యమృతకలశంబుఁ గొని తెమ్ము, మాకిమ్ము. ఇదియ మా యభీష్టము. దీన మీ దాస్యంబు వాయు. నీ కిది లీలామాత్రంబె గాని శ్రమంబుగాదు.

సుప—ఇదె మీ యాజ్ఞ శిరసావహించితి. పోయివచ్చెద.

అందఱు—స్వస్త్యస్తు, స్వస్త్యస్తు, స్వస్త్యస్తు. (నిష్క్రమణము.)

---

౨ రంగము—కద్రూ మందిరము.

వినత.

విన—అయ్యో, అతికోపము గలవాఁడీ సుపర్ణుఁడు. ఆ నాగుల కడకుఁ జనె. దాస్యము వాపుకొనిన వా రేమందురో? దానికి నీఁ డేమనునో, దాన నేమి ముప్పు వాటిల్లునో గద! ఉన్నది యుండగా నుపరి యీ కలహ మొక్కటి గొనితెచ్చుకొనుట యయ్యెనే? ఏమి సేయుదును?

వలదని వారించిన నతఁ డేమనియెడివాఁడో? వారలఁదన మూఁపునఁ బెట్టికొని మోయుచుండినచో వా రెట్టివారైన మా కేమి? ఒక పంచను జిని యొక పంచను బడియుందుముగదా?

బంధమోక్షములకు మనంబె కారణంబని నా యన్నకుఁ జెప్పనైనఁ జెప్పనైతినే? తన మనోరాజ్యంబునఁ దాను గాక

ప్రభు లెవ్వరు? ఆ తల్లి యనిన మాటలకే నిలువున నీఱగు
చుండె? నేను వారు దర్పంబున నేమి యుల్లసము లాడుదురో?
ఏమి యనిష్టంబు లగునోగద? హా కృపానిధీ, హా దీనబంధూ,
హా ఆర్తశరణ్యా! రావే నాసుపర్ణుం గావవే.

[సుపర్ణుడు-ప్రవేశము.]

సుప—అమ్మా, ఆ నాగుల దన్పితి. ఆ యమ్మ ఋణంబు చెల్లె. మన దాస్యంబు వాసె.

ఇదె పోయి యా మహేంద్రు నడిగి వాని యమృతభాండం బానాగుల కర్పించెద. వారల మెప్పించెద. నీ యాశీస్సులం దలనిడికొని పోయెద, సెలవిమ్మా.

విన—(కౌఁగిలించుకొని) తండ్రీ వారిం బ్రసన్నులం జేసితివా? వారు ప్రసన్నులైరా? ఆ తల్లియు య్యక్కొనెనా?

ఆ పురుహూతు నమృతకలశం బెట్లు దెత్తువోయి? తండ్రీ! నామంబు వీడవలదు సుమా. దానన సర్వకార్యంబులు సిద్ధించు. అందఱిలో నా దివ్యులు సామప్రియులు, దాన సాధ్యులైనట్లన్యంబునం గారు. ముమ్మాటికి నమ్ముము. నీ పథంబు శివంబయ్యెడు. ఆ మరుత్తులె నీకుఁ బ్రత్యంగరక్ష నొసంగెదు.

నీ పితృదేవుం డాకశ్యపార్యుఁడు. బ్రహ్మేంద్రాదులకు నలవిగాని తపంబునం దగిలి యున్నవాఁడు. తండ్రి యట్టి నీజనకునికి మదిం బ్రణామంబు సేయుము. ఆ తపోబలంబె నీకుఁ దోడయ్యెడు. ఆ రక్షయె నీకుఁజాలు.

సుప—తల్లీ నీ యా ప్రవచనంబులె నన్ను ప్రకాముం జేసినవి. హృది నుత్సాహం బతిమాత్రం బగుచున్నది. ఒకపరి యా గగనతలం బంటఁబారినఁ గాని యీ పక్షంబుల కాంక్ష దీరదు. పోయి వచ్చెద. (నమస్కరించును.)

విన—(మూర్ధాఘ్రాణము చేసి) లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం
పరాభవః! ఏషా మిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః॥

# అ మృ త హ ర ణ ము

## తు రీ యాం క ము

౧ రంగము-నిషాదద్వీపము-విప్రుఁడు, నిషాది.

విప్ర—అమ్మయ్య, అమ్మయ్య, నాతల్లి కడుపు ఫలమో, నాయాలిపుస్తై బలమో, లేకుంటే వీళ్ళంతా చేసిన పుణ్యమోగాని బతికి బయటపడ్డాను. నేను ముందు, ఇది వెనక-యిది మామనిషే లెండి, సందేహ మక్కర లేదు-నేను ముందు, ఇది వెనక వస్తూ ఉన్నాము. అయితే, పోనీ, మే మొక్కళ్ళమా? మహాజనం గాని? జనమంటే జనమా? ఇసక వేస్తే రాలకుండా, మాలం కల్లోని వాళ్ళందరూ, నిషాదగణం, ముగ్గురా, నలుగురా, రావణాబలగంగాని? పోనీ, జన్మకల్ల శివరాత్రి న్నారు. ఆ కైలాస మెట్లాగూ చూసేది లేనేలేదు, యీ కైలాసమైనా చూతామని బయలుదేరాము. పోతుంటే, మాయిది యిదిగో అన్నదో, లేదో, తిరిగి చూసేటప్పటికే నాకండ్లు మూసుకొని పోయినయి. చిమ్మచీకటి అంతా గుహాకారము. అంతలో అంతచీకటి అదెట్లావచ్చిందో? అమావాస్య అంధకారంలో అద్దినట్లగుపడుంతుడేదగద దీని అందము, అదిగూడ అగుపడలేదంటే! దీనికి తోడ సముద్రపుహోరు. ఏమిమోత, ఏమిమోత? ఆదేవతలో వంక, ఆ రాక్షసులో వంకపట్టి వెన్నంట తఱచిన్నాఁడైన ఆసముద్రంలో అంత హాలాదు పుట్టిందో లేదో? చెవులు దిమ్మెసి పోయినయ్యంటే! అదేమో మిడతపోటనుకున్నాను. కానిఅంతలో నాకాళ్ళ కింద భూమి జారిపోయి నట్లైంది. తల్లక్రిందుగా ఏదో సొరంగంలో బడిపోతున్నట్లుంది. ఎంతలోతు కుంబోతిమో నేఁ జెప్పలేను. నే నొక్కడినా? ఆ మహా బిలం

లోబడుతుంటే నాకెవ్వరు అగుపడలేదు గాని ఆ అగాధంలో బడుతుంటే, మా రాజుగారి కొడుకు పెండ్లిలో దొడ్డి సంభావననాడు పదివేల మంది బ్రాహ్మణ్యంలో తోసుకొని దొర్లాడినట్టే ఉన్నది. అందులా ఊరికే దిగిపోతున్నానట, కొంత దూరంపోయిపోయి ఒకచోట నేలతగ్గిన్నానట. ముందుకు రాను; వెనుకకుపోను. ప్రాణం ఉక్కిరి బిక్కిరైంది. ఇంకేమున్నట్టుంది. "ముత్తో" బ్రహ్మదేవుడా అని అరిచానట. అరవబోతే గొంతు రాదు. అయితే ఆ ఒక్క కేకకే అల్లవైకుంఠపురంలో ఆ మూల మేడలో ఆమూలగదిలో తనపెండ్లముతో ఏదో మాటామాటా వచ్చిపోట్లాడి పొందుచేసుకొని, ఒళ్లు తెలియకుండ భల్లూకం పలె బడి నిద్రపోతుఉన్న ఆ విష్ణుమూర్తి చెవులో జేఘంట కొట్టినట్టు వినబడి, ఆయన అట్టెఅదరిపడి, అత్తయ్యా, మని లేచామగాబోలు అప్పటికప్పుడే నేను 'రైఁ యని పైకి పోవటం పక్కను దిగటం మళ్లీ అమ్మకడుపులోనుంచి అవతరించేటం, ఇన్నైనయి. భూమిమీద రెండు కాళ్లుపెట్టి నిలబడ్డానో లేదో కొండంత తుండమేదో నిమురటానికి మొదలు పెట్టింది. దయ్యానునేదా, భూతమునేదా! నేనొక్కణ్ణయేమి చేయటానికి తోచలేదు. నోరుకట్టుకుపోయింది. మాటమడిగి పోయింది. కండ్లుపెట్టుకొని అటు ఇటు చూశాను. ఇది జ్ఞాపకమువచ్చింది. అయ్యో నాగమ్మ, అయ్యోనాగమ్మ, పెకలించుకొని పేరుబెట్టి పిలిచాను. కొండ మారుమ్రోగి నట్లయింది, 'ఓయ్' అంటే 'ఓయ్' అన్నది. ఇట్లాచూస్తునుగదాయిది.

సంతోషం పట్టలేక పోయినాను. అయితే పేదబాపణ్ణి. ఏమిస్తే నాఋణం దీర్చుకోగలను. ఏమిస్తే నావరాల్లచ్చిని విడిచిపెట్టుంది ఆ బ్రహ్మరాక్షసి? బొడ్డులో మాటముట్టుకోకుండనే

చిన్ననాటి ఆశీర్వచనపు ముక్క సమయానికి, జ్ఞాపకం వచ్చి దానినే వెనకకు ముందుకు మూడుసార్లు రువ్వి పెట్టాను. ఇంకేం జెప్పేది? ఆకొండంత ఆకారం అట్టె కదిలి. అట్టె కదిలి అంతరిక్షం బట్టింది. ఇట్టె చూస్తుండగనె బ్రహ్మాండమైన పక్షి. వల్లమాలిన రెక్కలు, ఆకాశమంత పొడుగు కాళ్ళు. ఏలోకము నుంచి యేలోకానికి పోతున్నదో? ఈభూమిని బంతి తన్నుకొని పోయినట్టు దన్నుకొని పోతే దిక్కెవ్వరనుకున్నాను.

ఓ యబ్బ, ఆపక్షిని దలుచుకుంటే నాకండ్లు గిఱ్ఱున దిరిగి పోతున్నాయి. నాఒళ్ళు సోలి పోతున్నది! ఓసీ, ఓసీ, రా, నన్ను పట్టుకో, పట్టుకో.

నిషా—నన్నెవరు పట్టుకుంటరు?

బ్రా—సిన్నెవ్వరైన బట్టుకుంటేనా ఎఱగరు? ముసలవాణ్ణను కొన్నారా? ఆకాలపువాణ్ణి, ఈకాలపువాణ్ణిగాను. ముగ్గురు వడుచువాళ్ళకు జవాబు చెప్తాను, చూడండి. ఉండు, ముందుకుండు.

౨ రంగము.—కశ్యపాశ్రమము.

(కశ్యపుఁడు ఫలాహారముం గొనుచు బ్రహ్మమునాత్మనివేదన మునఁ గన్నులు మూసికొని యుండును.

ప్రవేశము సుపర్ణుఁడు.—కశ్యపుఁడు గన్నులు దెఱచి,)

కశ్య—కుమారా, స్వర్ణపర్ణ బులుగల నీవెవ్వరవు? నీ విట్లేల వచ్చితివి?

సుప—తండ్రీ, అస్మజ్జనని దాస్యనిరాసార్థం బురగుల కమృతంబుఁ దేర నరుగుచున్నవాఁడ. నిషాదఖాదంబున నాకాఁకలి పోవకున్న యది నాకాహారంబుఁ బ్రసాదింప వేఁడెద.

కశ్యప—ఆహా యిపుడంతయు వ్యక్తంబయ్యె. మీ యమ్మ దాసి యయ్యెఁగా? విధిరహో బలవాన్. కుమారా, నీ యుద్యోగం

బు విడువకు. ధైర్యంబున ధర్మంబున సకలకార్యంబులు సిద్ధించు. పౌరుషంబునకెద్దియు నసాధ్యంబు లేదు.

(తనచేతిలోని ఫలము నొసంగి)

సుప్రతీకవిభావసు లిరువురు సోదరులు పిత్రర్థంబునకై కలహించి యన్యోన్యశాపంబులఁ గజకచ్ఛపరూపంబుల నొంది, సరోవరవిపినంబుల నుండి నిత్యంబు నొండొంటితోడం బెనంగి పోరుచుండు. అవి నీ కాహారంబగు, నరుగుము. కార్యసిద్ధి యయ్యెడు.

సుప—(నమస్కరించును)

కద్రు—శివమస్తు. (సుపర్ణుఁడు నిష్క్రమణము)

తొల్లి నేఁ బుత్రార్థినై దేవమునిగణంబుల సహాయముం బడసి పుత్రకామేష్టి సేయువాఁడనైయుండుతఱి దన బలంబునకుందగిన యిధ్మభారంబు మోసికొని యశ్రమంబున వచ్చువాఁడై యల్పకుశపలాశంబుల మోచికొని వడవడ వడంకుచు వచ్చు వారి నల్పబలుల, నంగుష్ఠప్రమాణదేహుల ననవరతోపవాసకృశీభూతశరీరుల వాలఖిల్యులంజూచి నగియె. దాని కమ్మునులు సిగ్గువడి గడునలిగి నీకన్న శతగుణసత్త్వుండైన పుత్రుండాకశ్యపున కుద్భవించెడు మనిరి.

ఆయుదంతం బెఱింగి యతఁడు నా పాలికిం జేసి నన్నడిగిన నేను వారిం బ్రార్థించి బ్రహ్మాసయుక్తుండగుట నతఁడె యింద్రుండగునని వారల నొప్పించి వాని యింద్రత్వం బేకాధిష్ఠితంబు చేసితి. ఇఁక నామునివచనం బమోఘంబుగావున నా పుత్రుండు పక్షికులంబున కింద్రుండయ్యె.

సుప—(ఆకాశమునుండి) భోస్తాత, నీ యనుజ్ఞంగొని గజకచ్ఛపంబులఁ గరముల్గం బట్టి యయ్యలంబతీర్థంబునకుం బోయితి. అందు రౌహిణంబను యుప్పాదపోత్తమంబు నన్ను సంభావించి తదీ

యశ్శాఖపై నుండి యగ్గజకూర్మంబుల భక్షించి పొమ్మనియె. అట్లు చేయుదు నని యమ్మహాశాఖపై నూద నమరకట్టి యందుఁ బాదంబులు పెట్టుడు నాశాఖ విరిగి దిక్కులు భేదిల్లె. అమ్మహా శాఖ నవలంబించి తలక్రిందై దపంబు సేయుచున్న వారి వాలఖిల్యమహామునిగణంబులు భూమిపయిం బడిన నిమ్మునులకు బాధ యగునని దానిం గఱచికొని గజకచ్ఛపంబులఁ గరంబుల నిఱికికొని గగనంబునం బఱచితి. నా కూద నిమ్మగు ప్రదేశం బెందునుఁ గానక యిచ్చటికి మిగుడ నేతెంచువాఁడ. కార్యం బెఱింగింపుము.

కశ్య—ఏమిచిత్రము! భోః తాపసోత్తములారా, ఇగ్గరుడుండు భువనైకహితసమారంభుఁడు, సత్వసమన్వితుఁడు. మీకు బాధ యగునని యిత్తరుశాఖ విడువనేరకున్నవాఁడు. వీనిం గరుణించి మీరొండుగడ కరుగుఁడు. దయసేయుఁడు.

(వాలఖిల్యులు విడచిపోవుట)

కశ్య—కుమారా, హిమశైలంబున నిష్పురుషనగంబు గలదు. అచ్చో నీ ద్రుమశాఖ విడువుము. అది యమానుషము నగమ్యము నగు. అట గజకూర్మంబుల భక్షించి యొకింత విశ్రమించి కుశలుండవై చనుము.

సుప—తండ్రీ, నీయాజ్ఞంగొని పోవుచున్నవాఁడ.

3 రంగము: ఇంద్రసభ (ఇంద్రుఁడు, బృహస్పతి)

ఇం— గురువర్యా, ఇ దేమి? ఇట్టి మహోత్పాతంబులకు నిమిత్తం బేమి? (వజ్రప్రసారణముఁ జేయును)

బృ— ఇంద్రా, బ్రహ్మణ్యుఁడౌ కశ్యపప్రజాపతి బ్రహ్మవరమునఁ దనపత్నియగు వినతయందు సుపర్ణుం డనువానిం గనియె. అ య్యనఘుండు వాలఖిల్యుల కృపాపాత్రుండై పక్షిలోకంబునకు రాజయ్యె, అతఁడిప్పు డుదధిలో నున్న యత్యుగ్రనిషాదుల

మ్రింగి గజకచ్ఛపంబుల రోహిణశాఖతో నెత్తికొని వాయువేగంబున నింగిం బఱపుచుఁ దనతల్లి వినత దాస్యంబు వాప దీక్షంబూని నీకడ నమృతంబుఁ గొంపోవ నేతెంచెను.

కామరూపి, కామగమనుం డాతఁడు. నీకు నసాధ్యుండు గానోపు. అతని మాహాత్మ్యంబు నీవు నెఱుంగనిది గాదు.

విహగేంద్రుం డానుపర్ణుఁ డిప్పు డమృతహరణార్థం బరుగుదెంచుటఁ జేసి స్వర్గలోకంబున మహోత్పాతంబులు పుట్టె. కర్తవ్యం బూహించునది.

ఇం—దౌవారికా, అమృతరక్షకులం బిలువుము.

దౌ—స్వామీ, చిత్తము.

ఇం—ఆచార్యా, దండదానంబులఁ జూడ నిశ్చయించితి. వాని శౌర్యరస మొకింతయైన రుచిఁజూడక మా యమృతరసం బీనొల్లను.

(ప్రవేశము అమృతరక్షకులు)

అమృతరక్షకులారా, పక్షీంద్రుండఁట, మనపై వచ్చుచున్నవాఁడు. మీ రప్రమత్తులై యతిప్రయత్నంబున నమృతంబు రక్షించుకొని యుండునది.

అమృ—మహాప్రసాదము. (అందఱు నిష్క్రమింతురు)

౪ రంగము-అమృతస్థానము, అమృతరక్షకులతో యుద్ధము.

( తెరలో )

సుప—రేరే అమృతరక్షకులారా, మీ ప్రాణంబులపై నాస గలదేని మీ మీ స్థానంబులఁ దొలఁగి నిలుచుఁడి.

అమృ—అరే పక్షిరాజా, నీ ప్రాణంబులపై నాస వదలితేని మమ్ముం జెనకఁజూడుము. లేదేని మా దెసం జూడకయే పొమ్ము. ఆ మహేంద్రు నరిగాపుల మగుట యెఱుంగవొ?

సుప—ఓహో, మహేంద్రుఁడా, యాతఁడె వచ్చి తలపడుఁగాక. నూరారైన నీయమృతకలశం బే హరింతు.

అమృ—సరి, యీ శస్త్రహతిం గాచికొనుము. చూచెదము.

సుప—ఇం కేమి చూచెదురా, బాలిశ! ఇదిగో నీ యొక్క శస్త్రంబు నకుం బదిశస్త్రంబు లెదురయ్యెడు. నీ పరివారముతోం గూడ నిం కేలోకంబునకైనం బొమ్ము.

అమృ—(అందఱు) హా, హా, హా.

(అమృతరక్షకుం డొక్కండు బరువెత్తుచుండం గొంద ఱెదురగుదురు. వారలతో)

అమృ—అమృతరక్షకు లందఱు హతమగుచున్నారు. ఆదిత్యులకుం బోయి చెప్పెద. వేంజేయుండు, వేంజేయుండు. (ఎదురైనవారు పరువెత్తుదురు.)

౫ రంగము—ఆదిత్యులతో యుద్ధము.

(తెరలో)

ఆదిత్యులు—ఓరోరీ ద్విజాధమ, దివిజులతోడి భండనంబునకె సమకట్టితి వంటరా? చూతుము. అస్మచ్చండాతపంబు సోకునం బిడికెండు బూడిదయై రాలంగలవు.

సుప—అహాహా, ఆదిత్యులారా, వృథాడంబరములం బోకుండు. మీతోడి భండనంబునకె వచ్చితి. ఏది, మీ చండత్వంబుల నిండారం జూచిపోయెదం గాక. మీ సాధ్యులు సాధ్యులైరిగా? మీ వసురుద్రు లేదిక్కులం బట్టి పోయిరో, వింటిరా? మిమ్ము నాయపరదిక్కుం జేరం బంపెద, రండు.

(తేజమంతయు నపరదిశం జేరును)

అమృ—(రథసముగం బోవుచు నెదురైన ధావకుని) ధావక, చూచితివా, యీ ద్వాదశాదిత్యులుగూడ నవశులై యపరాంబుధిం బడం బోవుచున్నారు; దిక్పాలకు లిప్పుడ యరుగుదెం

చిరి. వారి గతి యేమగునో యేరి కెఱుక? రాజున కెఱింగించి వచ్చెద. నీవు చెచ్చెరఁ బొమ్ము.

---

౬. రంగము-దిక్పాలకులతో యుద్ధము.

(తెరలో)

**సుప**—భో, భో, దిక్పాలకులారా, మీ రాజభక్తిం జూపుటకా? వేవేగ రండు. కాలహరణంబున మానాగులు గోపింతురు. వారి కీయభిజిల్లగ్నంబున కమృతభాండం బెత్తియిత్తు నని శపథంబుఁ జేసితి. ఒక్క గడియ యేని దడవు సేయరాదు. రండు రండు.

**దిక్పా**—రే, రే వాచాట, రే, తస్కరాధమ ! మా యమృతంబె హరియింతునని బాసఁ జేసితి వఁటరా? భళి! భళీ! నీ సాహసంబున కెంతయు సంతసం బయ్యె, పో. ఇఁక నీ ధూర్తత్వంబున కేగా బహుమానం బపేక్షించెదు?

ఇదిగో, నీ పక్షంబుల భారవిక్షేపంబు వాపి, నీ క్రూరనఖంబుల ఖరత్వంబు వోనాడి, నీ యఖండతుండప్రకాండంబు ముత్తునియలు సేసి, నీ యంతస్సత్వంబుఁ బట్టి పైకి రానీని నీ స్థూలదేహంబుఁ గిలుకీ లెడలించి, నీ ఘోరసంసారతాపత్రయం బంతయు నంత మొందించి, యనంతము, నవికారము, నఖండము, నఖిలాఖిలంబు నగు పరమస్వాస్థ్యం బిదిగో యిప్పుడే చూఱకొందువు, రా. ఆయమృతకుంభంబు జోడ నీ కేల? ఆ పొంత్తం బోకు మీ రోరీ మర్కదాంధ, మఱలుము, మఱలుము. ( దెబ్బఁదిని-హా మహేంద్ర, హా మహేంద్ర, హా.)

(ప్రవేశము అమృతరక్షకుఁడు)

అమృ—హా, హా, ఆ దిక్పాలురె పలాయితు లగుచున్నారు. ఇఁక దిక్కెవ్వరా మహేంద్రునకు దక్క? మొఱవెట్టెదఁగాక! (లోపల హాహాకారములు.)

---

౭ రంగము:- ఇంద్రసభ

[ఇంద్రుఁడు-సభ్యులు.]

అమృ—స్వామీ, దేవర యుత్థానంబున కవసరంబయ్యె. ఆ ద్విజేంద్రుని సముజ్జృంభణం బేమని వర్ణింతు? అతని రాకయే మృత్యువు రాక యయ్యె. మన దిక్పాలకులె పరాభవంబునం దిరోభూతులైరి

ఇం—ఏట్టెట్టూ?

అమృ—ఆ శ్వసనుం డాతని పక్షావకాశంబులం జిక్కి మసలఁజాలఁడయ్యె. ఆ యనలుం డాతని దృక్కీలంబులకె దూలి వ్రాయె. ఆ వరుణుం డాతని తుండబిలంబునం బడి వెడలలేఁడయ్యె. కాని వీరల నెట్టెట్టో యాతఁడు ప్రాణంబులతో మాత్రము విడిచె. ఆ యాదిత్యుల వాయాశ్వినేయులఁదిరిగి చూడకుండఁ బాఱిరో లె. ఇఁక నాసిద్ధులు సాధ్యులు యక్షరక్షోనివహంబు లెమైరో, యెందుఁ జొచ్చిరో కూడ నెఱుంగ రాదు.

స్వామీ, (పళయకాలరుద్రుండు వోలె దుర్నిరీక్ష్యుండై యున్నవాఁ డాతఁడు.

ఇట్లు నిర్జరాధీశుల నెల్ల నిర్జించి యార్జితుండై యమృతస్థానంబున కరిగె. దానిం బరివేష్టించి ఘోరసమీరప్రేరితంబై దుర్వారశిఖాజిహ్వల నంబరంబు నాస్వాదించుచున్న యనలంబుం గని తత్క్షణంబ సకలనదీజలంబుల నెల్లఁ బుక్కిలించుకొని వచ్చి యయ్యనలంబు నారఁజేసె. తీక్ష్ణాతితీక్ష్ణంబై సువినిర్మితం

పై పరిభ్రమించుచున్న యంత్రచక్రంబు డాయుచున్నవాఁడు. ఇఁక నయ్యమృతంబు చుట్టుచున్న యుగ్రభుజంగరాట్టుల గతి యేమయ్యెడినో? ప్రభువుల చిత్తము.

ఇం— ఔరౌర, యా చక్రంబె డాసెగా? ఇఁక నస్మత్కులిశ ధారం గాని వీని సంహారంబు గాదు.

౨ రంగము — అమృతస్థానము.

[ఇంద్రుఁడు-ప్రవేశము. గరుడుఁడు అమృతకలశము నెత్తికొని వినువీధిం బోవును.]

ఇం— రే, రే లుంటాక, రే, పాపీ, ఆ హరిపదంబు పట్టినంత నేమయ్యె నను కొంటివి గా? కులగోత్ర సంహారకం బీ వజ్రపాతము, దీని రుచి దగిలినం గాని నీ కయ్యమృతత్వంబు సిద్ధింపదు. (వజ్రము విసరును)

సుప— అహో, వజ్రరాజమ, నీ మహత్త్వం బే నెఱుంగనిది గాదు. నీ చేయు వేదన నన్నుం దాఁక నోపదు. కాని నీవు మహాముని సంభవం బగుట, నా దేవేంద్రు నాయుధం బగుట నిన్నవమానింపరాదు. కావున నాదీయైకపర్ణశకలచ్ఛేదంబు సేయుము. ఇదిగో నీ స్వామి కర్పింపుము. పోపొమ్ము.

ఇం— (స్వ) ఆహా, నన్ను వంచింప నెత్తివచ్చిన శాంబరీ పర్ణం బెవ్వఁడో యతిదివ్యుం డీ ద్విజరూపుఁడు.

(సుపర్ణ సహితముగ హరి యవతరించి)

హరి— ఇంద్రా, నేను నీ కాప్తుండ నగుచుండ నా పదంబు పట్టిన యీ సుపర్ణుండు నీ కనాప్తుం డగు టెట్లు? ఈతఁ డొక్కరుఁ డయ్యమృతంబుచేఁ జిక్కియు దీని పరతంత్రుండు వోలె దాని నాస్వాదింపఁడు చూచితె. ఇట్టి యలౌల్యము, ధైర్యము, నౌ

దార్ఢ్యము మన దివ్యులకేని దుర్లభంబులు గావె? ఆహా! సంయమధుర్యుండీ కుమారుఁడు. మన యీ స్వారాజ్యంబునకేని యర్హుఁడు. తనకై కామ్యంబులఁ గోరివచ్చిన వాఁడు గాఁడు. క్రూరుల చేఁజిక్కిన జనని దాస్యంబు వాప నుత్సహించి వచ్చె. ఆత్మయజ్ఞం బొనర్చె నిట్టి వాఁడు మన కాత్మబంధుండే గా?

నీ పతివత్సలుఁడవుఁ, గృపాళుఁడవు, 'యజ్ఞశేషం తథామృత' మ్మనిన ట్లాతని కయ్యమృతంబె యిచ్చి పంపుము. అయాచితంబగుట వీని కది యమృతంబె యగుఁ గాని యది యాచించిన వారికి భైక్ష్యంబు మృతంబె యగు

సత్సంగతి సాప్తపదీన మందురు. నేఁ బోయి వచ్చెద.

౩౦——కేశవ, ఈ యుదంతం బంతయు వింటి. నాకును గడు వేడ్క యయ్యెడు. ఇట్టి మహాత్ముండితఁడు మనకు మిత్రుఁడు గాక శత్రు వగు టెట్లు? నా భాగ్యవశమునఁ నితని స్నేహ మమరె. కార్య మూహింతుము. నీవు బోయి రమ్ము.

[హరియంతర్ధానము]

౩౦—సుపర్ణా, నీ మహత్త్వంబే నను గని సంతసమయ్యె. క్షమియింపుము. మన యీ సౌహార్దము జన్మాంతరంబులకేని భావస్థిరంబై యుండు గాక.

అయినఁ జూతుము. అజితుఁడవైన నీ వా హరిప్రసాదంబున నమృతుఁడవుఁ గూడ నైతివి గదా? ఇఁక నీ కమృత మిది యేల? నీ వంటి సత్పాత్రపరిగ్రహంబున నేము ధన్యుల మగుదుము గాక మన్యుల కిచ్చిన వారు మా కసాధ్యులు గారే? కావున మముఁ గరుణించి నీ వారలకియ్యమృతం బియ్యవలదు. వాక్కు నగుడ దమ్ము. నీ కిష్టావాప్తి యగు విధం బేగావించెద.

సుప—మహేంద్రా, నీ స్నేహంబున నేను గరితార్థుండ నైతి. ఇప్పుడేను మదీయమాతృదాస్యనిరాసార్థం బురగుల కమృతంబు దెచ్చి యిత్తునని నొడివి వచ్చినవాఁడఁ. వలతేని నే నీ యమృతంబు గొని పోయి వారల కిచ్చి యస్మజ్జనని దాస్యంబు వాపికొనిన నురగులీ యమృతంబు నుపభోగింపకుండ ముందఱ నీవు గొని చేనుము. దాన నుభయార్థంబు లయ్యెడు.

ఇం—సుపర్ణా, నీ మంత్రంబునకు సంతసం బయ్యె. నీవు నాతో నెప్పుడు బద్ధసఖ్యుండవై యుండవలయు. నీ కిష్ట మెద్దేని వెలవిమ్ము.

సుప—మహేంద్రా, ఇష్టమున కేమి. దుష్టులు దుర్మతులై మా కపిత మొనర్చిన యీ కాద్రవేయులు నాకు సర్వథా వశు లయ్యెడు. భగవదభిరక్షితంబు లగు నీ భువనంబులం దంతట నీ కిరాతులు ద్రిమ్మరుచుంట లోకహితార్థము నీ కెఱింగించి నీ యాజ్ఞం బడయవలసె.

ఇం—సుపర్ణా, లోకహితంబె కా నాకును సమ్మతంబు. అట్లె యయ్యెడు.



# అమృతహరణము

## పంచమాంకము

### ౧ రంగము కద్రూమందిరము

[ప్రవేశము సుముఖ, తక్షక, కాళియ, కర్కోటకులు.]

**సుము**—మన సుపర్ణుం డభిజిల్లగ్నంబున నమృతంబు దెచ్చి యిత్తునని చనియెఁగా?

**కాళి**—చనియెం గాని యసురరక్షోభిరక్షితంబై యున్న దానిం దెచ్చు టెంతవారికేని దుస్సాధ్యంబె యగు. అందు మనవాఁ డసహయోగంబున నసహాయశూరుండై చనియె. వాని గ్రహబల మెట్టిదో యిప్పుడ దెలసెడు.

**తక్ష**—సోదరులారా, మీ తర్కంబులతోఁ బనిలేదు. అల్లదె పూర్వోత్తరంబుం దిలకింపుఁడు. అంతర్వాహినులగు వియన్నదీపూరంబులో యన విద్యుల్లహరీప్రవాహంబు లా వినువీధిం గప్పనొప్పారుచు విజయోత్సాహియై మహారయంబున వెలుంగుచు వచ్చుచున్నవాఁ డాసుపర్ణుఁడు.

అమృతకలశంబె దెచ్చెడినో లేక యా మహేంద్రుం దన స్వర్ణపర్ణంబులఁ బెట్టికొని స్వారాజ్యంబె సాకల్యంబుగఁ గొని వచ్చెడినో?

**కర్కో**—అట్లయ్యెనేని వానికి స్వారాజ్యంబు వచ్చి మన కమృతంబు పోయెను. భళి, భళీ, ఏనాఁడా దేవత లా రాక్షసు లియ్యమృతముం ద్రిచ్చిరో గాని నేఁ డది మనకు భుక్తంబయ్యె. అమృతాశనంబు వ్రాసిన యా పాడుబ్రహ్మ మన కింకొక జిహ్వ యైన వ్రాయఁ డయ్యెనే! కడుపారఁగ్రోలియుందుము.

**కాళి**—తమ్ముఁడా, ఏమి నీ తత్తరము? (తెరలో, ఓహో అదిగో!)

సుప—ఓహో, కాద్రవేయులారా! అమృతంబు దెచ్చితి. ఇంక మా యమ్మ దాస్యంబు వాసె. సూర్యచంద్రతారాగణంబులు, పంచభూతంబులు, మీ హృదయంబె సాక్షి. వేవేగం జేసి స్నాతాలంకృతులై పరమపవిత్రంబుగ రండు పోండు. మీ పూజాగృహమండపంబునం జేరుఁడు.

కాళి—సోదరులారా, పోదము రండు.

కద్రు—కాళియా, నిదానించుము. కలశముం గన్నులారఁ జూచియే పోవుదము. రమ్ము.

౨ రంగము—పూజాగృహము.

[సుపర్ణుఁడు, కాళియుఁడు, కర్కోటకుఁడు.]

సుప—అన్నలారా, ఇదె యమృతకలశము. దీనిం గొని నా కనుజ్ఞ యిండు. స్నానపూతులై వచ్చితిరా?

కాళి—ఇదిగో పోవుచున్నాము. దాని నెచ్చటనైన శుచియైన ప్రదేశంబున నుంచుము.

కర్కో—ఎచ్చటనో గాదు. సర్వశుచియగు కుశాస్తరణంబున నుంచుము. అదిగో కుశకలాపము.

సు—సాధుగ నున్నది. (కుశలం బఱచి కలశము నుంచును.)

కాళి—కాని, సుపర్ణా, నీవు కృతార్థుండవైన తెఱంగుఁ జెప్పవైతివే? ఆ మహేంద్రుండు నిన్నుఁ జూడగనే యమృతం బిచ్చి పొమ్మనెనా?

సుప—అన్నలారా, అతఁడు మహోదారుఁడు. అమృతం బిచ్చియే పొమ్మనెను. కాని వానికి ముందు సిద్ధుల సాధ్యుల, నాదిత్యుల, నాశ్వినేయుల, దుది నాదిక్పతులం గూడఁ గడచితి. తదను హరిప్రసాదంబున మహేంద్రుండె సులభుం డయ్యె. అమృ

తంబు సిద్ధించె. ఇప్పుడు మీచేతం బెట్టితి. మహాపుణ్యఫలంబు
నా భుజియింపుఁడు. ఇదె మీకందఱకు వందనము.

కర్కో—సుపర్ణా, పురుషుండవన నీవ. నీ వంటివాని కీప్సితము లీడేర
కుండు టెట్లు? నీ ధైర్యస్థైర్యంబులు లోకమునకుఁ జాట ని
యుద్యోగంబు పెట్టితిమి గాక యమృతం బీ వేళ లేకున్న నేమి?
కావలెనన్న నిచ్చిన మహేంద్రుండు మాకు మాత్ర మీయ
కుండునా? ఇఁక మీ దాస్యంబు వాసె. మా యమ్మ యను
మతి యయ్యె. బలవంతుండవై మనుము. స్వస్త్యస్తు.

---

3 రంగము: పూజాగృహము.

(సుపర్ణుఁడు దల్లిని భుజములమీఁదఁ బెట్టికొని పోవును.)

సుప— ఆహా, కాద్రవేయులారా, మున్మాటికి మా యమ్మ
దాస్యంబు వాసె. మీ యమ్మ పణంబు సెల్లె. ఇదె మా
యయ్య యాశ్రమంబునకు బోవుచున్నవాఁడ. మీరలు సుఖం
బుండుఁడు. (నిష్క్రమణము)

(మహేంద్రుఁడు ప్రవేశము)

మహే—దుష్టులు కాద్రవేయుల కీ యమృతంబె వశమైన లోకములు
భరియించునా? "కార్యం సదా దుర్జనే" యని నట్లు లోకసం
గ్రహంబుఁ దలపెట్టిన నాకిప్పట్టున నిదియ పరమధర్మం బయ్యె.
అవుఁగాక. క్షుద్రు లీపాపులపైఁ బ్రహ్మాస్త్రంబులా?

(తెరలో)

ఎవ్వఁడవురా, పూజాగృహంబు సొచ్చితి? (ఇంద్రుఁడు కల
శమ్ముం జూపి యదృశ్యమగును. నాగులందఱు పరువులిడుచు
వత్తురు.)

రే శఠాధమ, రే ధూర్త, రే పాపీ, రే పశ్యతోహర, రే తస్కర పిశాచ, నిలునిలు మోరోరీ నిలునిలుము. మా భుక్తశేషంబు నీ కయ్యెడు.

తక్షు—(ప్రవేశించి) ఎవ్వఁడు గానరాఁడే?

కాళి—అమృతభాండం బపహరింప వచ్చిన ముచ్చెవ్వఁడో వీఁడు మన పంచనే డాఁగియుండె.

పద్మ—రక్షకుల నైనఁ బెట్టమైతిమే?

కద్రు—అయ్యో, తండ్రులార, ఆ యమృతం బాహరించిన యా మాయాసుపర్ణుండె దాని నపహరింప లేఁడు గద?

కాళి—వాఁ డప్పటి కప్పుడె దల్లిం గొనిపోయె.

కర్కో—దాని కేమి? మాయమ్మ యూహయె సరిగనున్నది. లేకున్న వాని కంత రభస మదేల? కాళియ, నే నప్పుడె నిన్ను వారించితిం గదా? వాఁ డాకసమునుండియే యఱచుటఁ జూడ నా మనంబున సంశయంబు వొడమె. అందులకె నిన్నాపి ప్రత్యక్షము చూచి పోయితిని.

కద్రు—ఆకసమునుండియే యఱచెనా? ఔరౌర, మన కీ యుత్పాతంబులు దెచ్చిపెట్టుటకీ మాయపక్షికిఁ దోడగు ధూర్తుం డచ్చట నెవ్వఁడో గద! వీని దుర్మంత్రంబు లన్నియు నాకసమునుండియే దిగుచున్నవే? ఆహా, యీపాపి నేనరకమునం ద్రోయుదురోయి తండ్రి.

కర్కో—అహో, ఏఁడీ, యా సుపర్ణహారకుం డేఁడీ? ఎటువోయె? ఏదిక్కుంజేనె? వెదకుఁడు, పట్టుఁడు; బంధింపుఁడు. ఆ గభీర పారావారంబు గహ్వరంబులం దూఱనీ, తుంగోత్తుంగహిమశైల కందరంబులం డాఁగనీ, కాదు, కాదు, మరల నా తల్లి మాయ గర్భంబె జొఱనీ, వాని నికృష్టాశదంష్ట్రావిషయోగంబున వెడలఁగ్రక్కించి, వాని చతురంగంబుల నేకాగ్రింబుగ నీ

పిడికిటంబట్టి, వాని తుండంబుఖండించి, వాని పత్త్రంబుల నుత్తరించి, వాని శకలంబులం బెకలించి వాని ప్రాణవాయువులతో గూడ నా యాదర్శ్యంబగు నమృతంబుంగొని గుటగుట ద్రాగి ద్రేవ్పకున్న నిదె మాకుల మాకులంబై కన్నులు గానక, వీనులువినక, కరపాదంబుల గతిచెడి, పొట్టలప్రైఁ బ్రాకుచు, మాకన్నబిడ్డల మేను గసకస నమలుచు, నుంటిందిని గాలిం ద్రావి, పక్షపక్షంబునం బ్రాయశ్చిత్తంబున మా పాప దేహంబుల దిగనాడుచు, మాకులం బకులంబగుదనుక మాకు వేఱొండురూపంబు లభ్యంబగుదనుక ఘోరతాపసులుం బోలె మానముద్రం జిక్కి భూగర్భంబె గృహంబుగాఁ గాఱుచీకటులం దిరుగాడుచుందుముగాక.

(ఆకసమున దేవతలు తథాస్తందురు.)

[శేషుడు ప్రవేశము.]

శేషు—శాంతం పాపం. ఆహా! సోదర, ఏమి యీ దుస్సాహసము? తల్లి శాపముం దప్పించుకొనిపోవుదమనియా! నీ విప్పుడీ ఘోర శాపంబుల మాటలఁ బైఁదొరయుట? ఇంతరౌద్రంబునకు గతంబేమి?

కాళి—ఆ సుపర్ణుండు దెచ్చియిచ్చిన యమృతము దృశ్యాదృశ్యంబైనది. దాని నెవ్వఁడో మాయాపురుషుం డొక్కఁడు హరించె.

శేషు—హరించె! అమృతంబు హరించె! ఆహా హా, నేఁ డెంతటి వంచన యయ్యె?

ఆ సుపర్ణుండు దన సమయంబుఁ జెల్లించుకొని పోయెం గాఁబోలు? అవుఁగాక. మన దుర్దైవంబె మనయందు నుండెఁగా!

ఆహా, ఆదినుండియు మన చరితం బిట్టిద!

చేఁజిక్కిన యమృతంబె హృతంబయ్యెఁగా! హా, హతవిధీ! మాపాపములకుం దగిన పరిణామంబనియో? నాటిననాఁడు

కోటి కేనయ్యె, కోయవచ్చినఁ గొండయయ్యె. కోపము తాపముం బోలు, తాపము బ్రహ్మహత్యం బోలు నండ్రు. మాకోపమా బ్రహ్మహత్యకుఁ గాకున్నఁ దదతిరిక్తంబగు నాత్మహత్యకే హేతువయ్యె. కార్యకారణరూపంబగుఁ గర్మసూత్రంబిదిగదా? సులభంబుగఁ దెలసె. భవతునామ. భావ్యమేవ భవతి. 'అవశ్యమనుభోక్తవ్య' మ్మని యనుభవింతుముగాక.

తమ్ములారా, వగవకుఁడు. ముందు కార్యంబేమి?

కర్కో—ఆ ప్రొద్దటు గ్రుంకునంతలో నాప్రతిన సాధింతు. అది దప్పిన నాశాపం బమోఘంబె యగు. నాతండ్రితపంబె యూన. ఇప్పుడిఁక వగచినఁ గార్యము గాదు. అమృతం బీవేళఁ బోయినఁ బోనిండు. అదిగో! సిక్తంబైన యాకుశాస్తరణంబున నమృతచ్ఛాయలిఁకను మృగమరీచికలం బోలి మెఱయుచున్నవి. దానంబడి నాలుకలైనఁ దడుపుకొందము. మనయమృతత్వంబున కదియ చాలు— (డాసి) అహహా, చాలు, చాలు. ఇఁక నేశాపంబులు మనల నంటఁజాలవు. రండు, రండు, విలంబనం బయ్యెడు. (అందఱు పోయి దానంబడి జిహ్వలు చీలి పోవ రక్తసిక్తముఖంబులతో నేడ్చుచు గోల పెట్టుదురు.)

— భరతవాక్యము —

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు॥

సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక

| పుటసంఖ్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | ౯ | ముదుల | ముద్దుల |
| ౨ | ౨౩ | క్షిరము | క్షీరము |
| ౭ | ౧౦ | గష్టము నేమో? | గష్టమగు నేమో? |
| ౧౧ | ౧౫ | ప్రాకృతదై | ప్రాకృతవై |
| ౧౧ | ౨౪ | మణయందు | మణియందు |
| ౧౩ | ౧౦ | నౌక వేళ | కౌక వేళ |
| ౧౬ | ౫ | మింగ | మ్రింగ |
| ౨౨ | ౧౩ | భేద | ఖేద |
| ౨౩ | ౧౧ | వాక్మకలంబుల | వాక్యకలంబుల |
| ౨౪ | ౧౭ | తల్లి | తల్లీ |
| ౨౮ | ౧౮ | విప్రాశిరాదములు | విప్రాశీర్వాదములు |
| ౩౪ | ౨౨ | నికేట | నీకేల |
| ౩౬ | ౭ | బడును | పడును |
| ౪౦ | ౬ | నేనుని | నేమని |
| ౪౮ | ౨౯ | పతుల | వతుల |
| ౫౭ | ౧౯ | డబరముల | డంబరముల |
| ౬౧ | ౧౬ | మహోత్వం | మహాత్వం |
| ౬౧ | ౨౧ | పరిగ్రిహాబున | పరిగ్రిహాంబున |
| ౬౩ | ౨౦ | ...ఓ హో | (... ఓ హో) |
| ౬౮ | ౧ | మహిం | మహీం |